## నవయుగ సంక్షోభాల నవలా సమాహారం
























మనిషికీ మనిషికీ మధ్య
వి. రాజారామమోహనరావు. రు 5

స్మశానం దున్నేరు
డా॥ కేశవరెడ్డి రు 6

శతాబ్దాల నిశ్శబ్దం
దశరథ్ రు 7

---

దేవుళ్లారా మీ పేరేమిటి?
శ్రీకాంత్ రు. 5

కన్నీటికి నోరొచ్చింది
గౌరీ విశ్వనాథ్ రు 6

వీళ్లూ మనుషులే
డా॥ పరుచూరి రాజారాం రు 6

---

బలిపశువు
జాతశ్రీ రు 5

కోటి కుటుంబాల ఘోష
కె. బ్రహ్మానందరావు రు 5

సంకెళ్లు తెగుతాయి, మల్లిక్ రు 6

---

ఏటేటా పోటీల్లో బహుమతులు పొందిన 9 నవలలు

---

# విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

చంద్రం బిల్డింగ్స్ విజయవాడ 520004

## విశాలాంధ్ర బుక్ హౌస్

□ విజయవాడ □ హైదరాబాద్ □ అనంతపురం □
□ విశాఖపట్నం □ తిరుపతి □ వరంగల్ □ గుంటూరు □

# జనం నాలుకల్లో జీవించిన జాషువా

**28-9-1895** **24-7-1971**

"కుల మతాలు గీచుకొన్న గీతల జొచ్చి
పంజరాన గట్టు వడను నేను
నిఖిలలోక మెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడ నేను."

అనగల్గిన ధీమాకల కవి జాషువా. జాషువా అనగానే మన కళ్ళముందు మెదిలే కావ్యం గబ్బిలం. మేఘ సందేశంలాగా రాసిన కావ్యం ఇది. పక్షి జాతిలో కూడా గబ్బిలం స్థానం అందరం ఎరిగిందే. అలాంటి దాన్ని సందేశం తీసికెళ్ళ మని అడుగుతాడు కవి. ఆనాడు దేశారాధనం జనంమనస్సుల్లో ప్రభంజనంలా వీస్తుండేది. బానిస బతుకుమీద రోత నరనరాల్లో ప్రవహిస్తూండేది. ఈ గ్రంథంలో ఈ భావాన్నే గౌణంగా చెప్పాడు జాషువా.

జాషువా వినుకొండలో 1895 సెప్టెంబరు 28న పుట్టారు అస్పృశ్యత - దారిద్ర్యం నాగులల్లే జీవితమంతా వెంటతరిమాయి. అడుగడుగునా సమాజం బుస కొట్టింది. 'నువ్వేం కవి వని' ఈసడించింది. అలాంటి వాళ్ళనుగూర్చే-

'నాదు కన్నీటి కథ సమన్వయము సేయ
నార్ద్ర హృదయంబు గూడ కొంతవసరంబు'

అని అంటాడు.

ఉపాధ్యాయుడుగా జీవితాన్ని ఆరంభించిన తొలినాళ్ళలో ఒక కవి పండితుల సభకెళ్ళాడు. వేదికపైకి పోతున్న జాషువాను చూచి

"సభలోనికి ఈ నిమ్నజుడు ఎట్లు చొరబడె నంచు
తమలో తాము గుభ గుభ లాడి"

లేచి పోయారు. జాషువా మనస్సు గాయపడింది. వీరే రైలు ప్రయాణం చేస్తున్న మరో సందర్భంలో - కవిత్వం వినిపిస్తుంటే మరో పండితుడు బావుందన్నాడు. మాటల మధ్య జాషువాగారి కులం తెలుసుకున్న మీదట ఆ పండితుడు 'వాణి మైల పడ్డదని' లేచి వెళ్ళి పోయాడు. ఈ ఘటనలు సున్నిత హృదయుడైన కవిని కలవర పెట్టాయి. అందుకే.

నా కవితా వధూటి వదనంబు నెగాదిగ జూచి రూపురే
ఆ కమనీయ వైఖరులు గాంచి భళీ, భళి! యన్న వాడె "మీ
దేకుల" మన్న ప్రశ్న వెలయించి చివాలున లేచి పోవుచో
బాకున గ్రుమ్మినట్లగున్ పార్థివచంద్ర! వచింప సిగ్గగున్.

— జరీ

అని తర్వాత కల్పిన వెంకటగిరి రాజాకు చెప్పుకున్నాడు. ఈ భావాలనే తన "శ్మశాన వాటిక" ఖండికలో గుండె కరిగించి పోశాడా అన్నట్లు

ఇట నస్పృశ్యత సంచరించుటకు దావేలేదు ... .... ఉ
త్కట పుంబెబ్బులి తోడ మేక నొక ప్రక్కన్ జేర్చి జోకొట్టి యూ
రట కల్పించు నభేద భావమును ధర్మంబిందు గారాడెడిన్

అని అంటాడు. ఈ సందర్భంలోనే జాషువా గారికి తెలిసిన ఒక దొరగారి-భార్య కాబోయే భారతీయ స్త్రీ - పసుపు కుంకుమ ప్రమాదవశాత్తూ పులి వేటలో దొర మరణంతో రాలిపోయింది. అది చూసే

'ఇచ్చోటనే లేత ఇల్లాలి నల్లపూ
సల సౌరు గంగలో కలిసిపోయె'

అని ఆవేదన చెందాడు.

జాషువా ఫిరదౌసి, స్వప్నకథ, గబ్బిలము, నేతాజీ, స్వయంవరం, కొత్తలోకము, క్రీస్తు చరిత్ర, నా కథ, ముంతాజ్ మహలు, అనాథ కాందిశీకుడు, ముసాఫర్లు, నాగార్జునసాగర్, ఖండ కావ్యాలు మొదలైన కావ్యాలు రాశాడు. ధృవవిజయం, హిమదమార్కపరిణయం, చిదానంద ప్రభాతం, రుక్మిణీ కళ్యాణం, మీరాబాయి, తెరచాటు వంటి నాటకాలు రాశాడు, చిన్నా నాయకుడన్న పెద్ద కథ రాశారు. జీవితంలో తనకు 'పేదరికం - కులమత భేదం' అన్న వాళిద్దరు గురువులనుకన్న వ్యక్తి జాషువా. ఒకటి సహనాన్ని నేర్పితే మరోటి నిర్భయంగా ఎదిరించాలన్న పాఠం నేర్పింది. 'ఇతడు కవిత్వం రాస్తున్నాడు మైల పడిపోతుంది సరస్వతి' అని హిందువులు గోల పెట్టారు. హిందూ పురాణాలు చదివి కావ్యాలు రాసి భ్రష్ఠు పట్టిపోతున్నాడని క్రైస్తవులు గగ్గోలు పెట్టారు.

ఎందరేమన్నా ధైర్యంగా ఎదుర్కొన్నాడు. సినిమాలలో కథా వాచకుడుగా ఉన్నా యుద్ధ ప్రచారకుడుగా ఉన్నా తన సమాజంలోని నైచ్యాన్ని - దౌష్ట్యాన్ని కవితలలో ఎండ గట్టాడు. కల్లబొల్లి కథలను నమ్మననీ జీవితం నేర్పేదే నిజమైందంటూ

"వాస్తవజ్ఞాన సంపత్తి ఖూనీ చేయు గాథలు జీర్ణంబుగావునాకు" -అని వెల్లడించారు.

సంఘ సంస్కర్తగా, సాహితీవేత్తగా నిజ జీవితమే కవితాత్మగా మలుచుకొన్న వ్యక్తి జాషువా, లెక్కలేనన్ని బిరుదులు పొందారు. అనేక ప్రభుత్వ సన్మానాలందారు - బహుమానాలు స్వీకరించారు.

వీరే షాజహాన్ ముంతాజ్‌ల గూర్చి అన్నట్టు
"మొగలాయి రాజు తెలిగన్నుల రాల్చిన బాష్పధారలే
పొదలి ఘనీభవించినవి ముద్దుల తాజమహల్లు పోలికన్"

జాషువా గుండె కరిగి కావ్యాల రూపు దిద్దుకున్నాయి.

నేల మీద కాలు నిలుప కంబర వీధి
ఖేచరుల విధాన క్రీడ సల్పి
ప్రజల కొరకు పాటు పడినాడ నని పల్క-
మంత్రి వర్యులింక మాకు వలదు.

అన్నదాంట్లో జాషువా గారి ప్రజాహితభావనలు తొంగిచూస్తాయి.

ఏమైనా తుదకంతా దరిద్రంతో పోరాడుతూ, అవమానాల నెదుర్కొంటూ, అస్పృశ్యత నదలిస్తూ "నవయుగ కవి చక్రవర్తి" జాషువా-

గవ్వకు సాటిరాని పలుగాకుల మూకలసూయ చేత న
న్నెవ్విధి దూరినన్ ననుసరించిన శారద లేచి పోవునే?
యివ్వసుధాస్థలింబొడ మరే రసలుబ్ధులు? గంట మూనెదన్
రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్ర వాణికిన్

అని కవితాలంకారాలతో తెలుగు సాహిత్యాన్ని సుందరతర మొనర్చారు.

"పందె మొడ్డెద విశ్వ ప్రపంచమందు
నుదువు దప్పని యాంధ్ర భూపుత్రుడను"

అని మీసం మెలేస్తూ 1971 జులై 24 వరకూ మన మధ్య జీవించారు.

"రాజు జీవించె రాత్రి విగ్రహము లందు
సుకవి జీవించె ప్రజల నాలుకల యందు"

('మానాన్నగారు' - ఆధారంగా)

---

సంపుటి 3 సంచిక 10

---

## ఈ సంచికలో....

కథలు : నమ్మకం; ఫైవ్‌నాట్‌ఫోర్; ఆకలి; కొత్తగాలి; ఓ శవం కథ;

కవితలు : నగ్నసత్యం; కొందరి జీవితాలు; పరీవాహం; స్థితి; ఓటుకాలం; అసహ్యమైన అనాగరిక దృశ్యం; తమాషా; సమాధిచేసేయ్; భూమిని నడిపేవాడు; నో అదర్‌గో; విమోచన;

వ్యాసాలు: జనం నాలుకల్లో జీవించిన జాషువా; రచనా స్వాతంత్ర్యమూ-నిబద్ధతా; చలం-స్త్రీ, కావ్యసమీక్ష; చర్చావేదిక; తెలుగులో నిఘంటు నిర్మాణం; మధ్యతరగతి నీచత్వం; అంటరానితనం రెండు నవలలు; తెలుగు కథలు-సర్వే.

---

శ్రీ జి. వి. కృష్ణారావు; పి.వి. రాజమన్నార్‌ల మృతికి అభ్యుదయ సంతాపం ప్రకటిస్తూంది.

# మా నెత్తురు - విత్తనం

మూలం :

## అగస్తినో నేటో

మేం
ఎక్కడో సుదూర ఆఫ్రికానుంచి
మనిషి వెన్నుపోట్ల విద్రోహాల కతీతమై
గంభీరమై అజితమైన అడవులకటు
ఆతృతగా ఆవేదనగా అనంతంగా సాగే
నదీ గర్భ గర్భంలోని ప్రాణప్రవంతి కటు
మృదు గంభీరమైన దప్పుచప్పుళ్ళలోంచి
అక్షౌహిణీల యువాత్ముల్లోంచి
యువాక్షౌహిణీల వీక్షణాల్లోంచి
చాచిన బాధల ఆశల అగణిత హస్తాల్లోంచి
ఎక్కడో దూరంగా విసిరేసిన
ఆఫ్రికాలోంచి
పంజానఖాలకింద అణగిన
మా నెత్తురు
వేదనలనుంచి
ఆశలనుంచి
విషాదాలనుంచి
సత్తాలనుంచి
నెత్తురై స్రవిస్తున్నాం
పాదపళ్ళతో పెళ్ళగించిన
ఖాళీ బొబ్బెలాటి బాళ్ళ నేలమీద
నెత్తురై స్రవిస్తున్నాం
పత్తిపొలాలలో బలవంతపు బానిస
చాకిరిలో
చెమటతో కలిపి నెత్తుర్లు స్రవిస్తున్నాం
నల్ల పసిపాపవీపు ఎర్రగాయాలమీద
మాతృహృదయంమీద
మంటగల్సిన మర్యాదమీద

అనువాదం :

## అభ్యుదయ

ఆకలై
అజ్ఞానమై
నిరాశై
మృత్యువై
నెత్తుర్లు స్రవిస్తున్నాం
నెత్తురు - విత్తనం
ఎక్కడో సుదూర ఆఫ్రికానుంచి
నల్లని నలుపు
స్నేహోదయాల్లాటి మెరుపు
స్వేచ్ఛా సోపానాల్లాగ దృఢమైన ఆకాంక్ష
మా రోదనలు
ఉద్రేకాల తిరుగుబాటు
కాంక్షల్ని విరజిమ్మే ఢమరుకాలు
జాతుల సంగీతాలు
మా ఆక్రందనలు
మలివెచ్చని ఎండలో విత్తుల్లా
మట్టిమీది గుండెల్ని
పూయించే ప్రేమ మంత్రాలు
ఆఫ్రికా ఆక్రందనలు
సముద్రాల్లోంచి
సంకెళ్ళువేసిన శవాలు మొల్చినపుడు
గొల్లున ఏడ్చే సూర్యోదయాలు
హో - నెత్తురు - విత్తనం.
చూడు - ఇవిగో చాచిన మా చేతులు
మనిషి భవిష్యత్తుకోసం
న్యాయం కోసం
శాంతికోసం
కృతనిశ్చయంగా ఐక్యమవ్వాలనే

మానవ సోదరత కోసం
ఇదిగో – చాచిన మా చేతులు
మా మడమల్లోంచి గులాబీలు పూస్తాయి
జైరేనది చిక్కని సౌరభాలు అద్దుకుని
మొజాంబే వృక్షాల గంభీరత్వం దిద్దుకుని
మా మస్తిష్కాల్లో
ప్రపంచానికి ఆఫ్రికా స్నేహ రహదారి
మా కనుపాపలు–ప్రాణం రక్తం–అన్నీ
ప్రపంచమంతటా ప్రేమని ప్రసరించే
చేతులవైపు చూపు
భవిష్యత్తు చేతులు - మనుషుల దేశంగా
ఆఫ్రికా స్వశక్తిమీద విశ్వాసం రగిలించే
చేతులు

ఎక్కడో సుదూరంగా ఆఫ్రికా
ఆశాసూర్యుని కిరణాలలో
కొత్తతరాన్ని చిగుర్చుకుంటూ
శాంతికోసం పోరాటంలో
పేదరికం నుండి విముక్తి పోరాటంలో
సోదరత్వం బాంధవ్యం సృజిస్తూ
నెత్తురు విత్తనం
భవిష్యత్తుకోసం ఇదిగో మా కనుపాపలు
శాంతికోసం మాగళాలు
శాంతికోసం మా హస్తాలు
ఆఫ్రికా నుండి– ప్రేమతో ఏకమై
మేం...

(నేటో ఈమధ్యనే మరణించారు.)

---

## సాహితీవేత్తలకు అభ్యుదయ సాహిత్యోద్యమ శ్రేయోభిలాషులకు

# వినతి

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం కార్యవర్గం, సమితి హైదరాబాదులోని రాష్ట్ర కార్యాలయం (నార్ల చిరంజీవి గ్రంథాలయంలో) సెప్టెంబరు 22, 23 తేదీల్లో సమావేశమయ్యాయి. తెలుగు సాహిత్య స్థితిగతులు, మన ఉద్యమం, వివిధ జిల్లాలలో కార్యక్రమాలు, అభ్యుదయ పత్రిక నిర్వహణ యిలా అనేక విషయాలను కూలంకషంగా చర్చించి నిర్ణయాలు చేశాయి.

కార్యవర్గ సమావేశాలకు డాక్టర్ సి. నారాయణరెడ్డి, శ్రీ కుందుర్తి ఆంజనేయులు, సమితి సమావేశానికి శ్రీ తుమ్మల వెంకట్రామయ్య అధ్యక్షత వహించారు.

అబ్బూరి, చలం, డా॥ జి.వి. కృష్ణారావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, రంగనేని, సిమొనోవ్, అగస్తినో నేటోల మృతికి సంతాపం ప్రకటిస్తూ తీర్మానించారు.

ఉన్నవ లక్ష్మీనారాయణ శతజయంతి సందర్భంగా ఆయన చిత్రంతో స్మారక తపాలబిళ్ళను ప్రకటించాలని కోరుతూ తీర్మానించారు. జిల్లాలలో ఉన్నవ జీవితం రచనలు ఇతివృత్తంగా సదస్సులు జరపాలని నిర్ణయించారు. గతంలో జనతా ప్రభుత్వం సెక్యులర్ భావాలుగల చరిత్ర పుస్తకాలను నిషేధించడం తప్పని ప్రస్తుత కేంద్ర మంత్రివర్గం ఖండించడంపట్ల సమావేశం హర్షం ప్రకటించింది. అయితే ఆ గ్రంథాలను తిరిగి పాఠ్యగ్రంథాలుగా ప్రవేశపెట్టి తద్వారా మన జాతి ఆదర్శ సెక్యులర్ ఔన్నత్యాన్ని చాటాలని కోరింది

తెలుగు గడ్డమీద అద్వితీయ సాహిత్య సిద్ధాంత పత్రికగా అందరి మన్ననలూ చూరగొంటున్న అభ్యుదయ స్థాయిపట్ల సభ్యులంతా సంతృప్తి ప్రకటించారు. కథలు మాత్రం తగుస్థాయిలో లేవని భావించారు ప్రచురణలు మరింత పెంచేందుకు నిరంతర కృషిని గురించి – కాగితం, ముద్రణ ఖర్చులు శరవేగంతో పెరుగుతున్న దృష్ట్యా పత్రిక నిర్వహణ ఎంత క్లిష్టతరంగా ఉన్నది, ప్రధాన కార్యదర్శి శ్రీ ఏటుకూరి ప్రసాద్ సవివరంగా తెలిపారు. పత్రిక చందాలు చేర్పించడంలో, వ్యాపార ప్రకటనలు సేకరించడంలో శాయశక్తులా పాటుపడతామని సభ్యులు, ఆహ్వానితులు అందరూ వాగ్దానం చేశారు. విజయవాడ శాఖవారు అదనంగా 100 చందాలు చేర్పిస్తామన్నారు. విడిప్రతి వెలని 1-50 పైసలకు పెంచవచ్చని, సంవత్సరం చందామాత్రం 12 రూ. ఉంచాలని అత్యధికులు అభిప్రాయం వెలిబుచ్చారు.

రాష్ట్ర రాజధాని హైదరాబాదులోనూ, వివిధ జిల్లా కేంద్రాలలోను శాఖల సాహితీ కార్యక్రమాలపై ప్రధాన కార్యదర్శి నివేదికను సమావేశంలో చర్చించారు.

ఉద్యమానికి కీర్తిప్రతిష్ఠలు విస్తరిస్తున్న ఆ మేరకు నిర్మాణం, కార్యకర్తలు, కార్యక్రమాలు లేవని కొందరు సభ్యులు విమర్శించారు. నూతన పద్ధతులలో సాహిత్య చర్చలు గోష్ఠులు ఆసక్తిదాయకంగా నిర్వహించి యువరచయితలను ఆదర్శవంతమైన పంథాలో తీర్చిదిద్దాలన్నారు. అభ్యుదయ సాహిత్యవ్యాప్తితోబాటు క్షీణసాహిత్యం విపరీత ధోరణులపై నిర్దాక్షిణ్య విమర్శ ఆయుధంగా పోరాటం ప్రధాన లక్ష్యాలుగా ఉండాలన్నారు.

ఈ దశాబ్దంలో అరసం పునర్నిర్మాణం అభ్యుదయ రచయితల మధ్య అధికాధిక ఐక్యత ముఖ్యఘట్టాలని సమావేశం పేర్కొంది. "ఈ దశాబ్ద సాహిత్యం" అన్న ఇతివృత్తంగా వివిధ రూపాలపై సదస్సులు జరపాలని నిర్ణయించింది. డాక్టర్ నాయని కృష్ణకుమారి, దాశరధి రంగాచార్య, మల్లికార్జునలతో ఒక ఉపసంఘాన్ని నియమించింది.

చర్చలలో పాల్గొన్నవారిలో డా. నారాయణరెడ్డి, డా బూదరాజు రాధాకృష్ణ, రాంభట్ల, తుమ్మల, డా. నాయని కృష్ణకుమారి, దాశరధి రంగాచార్య, డా. రావి

భారతి, శ్రీమతి పరిమళా సోమేశ్వర్, ఏటుకూరు బలరామమూర్తి, కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), కె.చిరంజీవి, వై విజయకుమార్, కె.ఆర్. సంగాల, రవి, వల్లెల వీరాస్వామి, ఎస్. వి. సత్యనారాయణ, శ్రీమతి యలమంచిలి తాయారమ్మ, కిశోర్, ఆర్.వి. రామారావు ప్రభృతులున్నారు.

"ఈ దశాబ్ద సాహిత్యం" యితివృత్తంగా రాష్ట్రస్థాయి సదస్సులను వివిధ సాహితీరూపాలపై నిర్వహించాలని అరసం కార్యవర్గ సమితి సమావేశాలు నిర్ణయించాయి. ఇది చాలా పెద్ద బాధ్యత. ఇంతవరకు ఏ సాహిత్యసంస్థా చేపట్టని కార్యక్రమం. ఈ సదస్సులు సఫలమైతే తెలుగు సాహిత్యామ తల్లికి అభ్యుదయ సాహిత్యోద్యమం అలంకరించిన మరో కలికితురాయి అవుతుంది.

ఇందుకు సృజనాత్మక సాహిత్య స్రష్టలందరి సహాయసహకారాల్ని అరసం వినమ్రంగా వేడుకుంటున్నది.

ముఖ్యంగా వివిధ సాహిత్య ప్రక్రియలపై పరిశోధనలుచేసి విలువైన రచనలు వెలార్చిన సాహితీపరిశోధకులు, వేత్తల సహాయసహకారం లేనిదే ఈ బృహత్కార్యం నెరవేరదు. రాష్ట్రంలోను, దేశంలోను వివిధ విశ్వవిద్యాలయాలు కళాశాలల్లో కృషిచేస్తున్న అట్టి సాహిత్యోపాసకులందరినీ ముఖ్యంగా యువ మేధావులను ఈసదస్సుల నిర్వహణలో బాధ్యత పంచుకోవాల్సిందిగా అరసం సవినయంగా ప్రార్థిస్తున్నది.

1980 ముగిసేలోగానే ఈ రాష్ట్రస్థాయి సదస్సులు రెండేసి నెలలకొకటి చొప్పున ఒక్కొక్క ప్రక్రియపై ఒక్కొక్క జిల్లాలో నిర్వహించాలని అరసం సంకల్పం. ఈ సదస్సులలో చర్చించే పత్రాలన్నీ ముందుగానే సిద్ధమై ఉండాలి. సదస్సు రోజునే ఆ పత్రాలు ప్రచురించిన అభ్యుదయ ప్రత్యేక సంచికను ఆవిష్కరిస్తారు.

ఈ సదస్సుల నిర్వహణను గురించి మీమీ అభిప్రాయాలు సూచనలు సలహాలు ఉపసంఘానికి అందజేయాల్సిందిగా ప్రార్థిస్తున్నాం. మీ సూచనలు ఈ కింది వివరాలతో అరసం కార్యాలయానికి వెనువెంటనే పంపండి.

పేరు, చిరునామా

మీరు చేసిన సాహిత్య పరిశోధన

ఏ ప్రక్రియపై సదస్సులో పాల్గొనాలని ఆసక్తి?

(1) నవల (2) కవిత (3) సాహిత్య విమర్శ (4) కథానిక (5) భాష (6) ప్రదర్శకరూపాలు (7) జానపద సాహిత్యం-సదస్సు నిర్వహణ ఎలాఉండాలో మీ అభిప్రాయం. సూచనలు.

కథానిక

పి. ఏ. రాజు

# నమ్మకం

అందరం మా అలవాటు ప్రకారం ఊరపతల హైస్కూలు మైదానంలో కలుసుకున్నాం మేతకని

ఆ ఊరి పశువులతో సరిపోలిస్తే నా పరిస్థితి వేరు. ఆకలి, దప్పి గొడవే నాకులేదు. మా యజమాని కొడుక్కి నేనంటే చెప్పలేనంత మగ్గర. ఎవరెవరి పొలాల్లోని పచ్చగడ్డో, పంటకురాబోయే పెసరచేనో కోసి నా ముందు కుప్పలు తిప్పలుగా కుమ్మరిస్తూ ఉంటాడు. అందుకని యిలాంటి సమయాల్లో మేతమీద కాక కబుర్లవైపు నామనసు తూగిపోతూ ఉంటుంది. ఎవరితో ముందు మాట్లాడాలా అనుకుంటూ ఉండగా నాప్రక్కన మేస్తున్న ముసలిగేదె బారడంత మైదానాన్నీ హఠాత్తుగా ఖరాబు చేసింది. నాకు ఒళ్లు మండి "నీకేం మతిపోయిందా? పిల్లల ఆట స్థలాన్ని పాడుచేసేస్తావా?" అని గసిరాను.

ఆ గేదె చూపుకి నీరసంగా ఉన్నా చిరాకులో చిన్నదేంకాదు, వెంటనే "ఏంది యిది వాళ్ళ తాతగారిసొత్తు, మనది కాకపోయిందా? ఈ మైదానం ఆట గురించే అయితే ఎదుంకురోజూ ఆడుకోరుపిల్లలు? ఆడుతూ ఉంటే యిలా గడ్డి, గత్తరా యెందుకుంటుంది? ఊరకనే ఇలా ఉంచే కంటే గడ్డి బీడుగా మన పశువులకు కేటాయిస్తే ఈ మనుసులుకి పాలూ, పుణ్యం రెండూ దక్కేవికదా" పుసులు కట్టిన కళ్ళను మిటకరిస్తూ గుక్కతిప్పు కోకుండా జవాబిచ్చింది గేదె.

'ఏంటి విశేషం, నీధోరణి సామ్యవాద సరళిలో సాగుతుందేఅని అనాలనుకున్నాను. కాని మాలో మాకు అనవసరంగా వర్గ కలహాలు మొలకెత్తుతాయని భయపడి కొంచెం సానుభూతిగా 'ఒంట్లో బాగాలేదా? చాలా డీలాగా ఉన్నావే' అంటూ విషయం మార్చాను.

'డీలా యేమిటి, పండక్కి ఉరకా, బరకా మెక్కేసుంటుంది కాబోలు. అజీర్తి తగులుకుంది.' నా ప్రక్కనున్న పుల్లావు నోరు పారేసుకుంది.

నిజం ఒప్పుకోవద్దూ, యీ పుల్లావుకి దాని యజమానురాలిలా నోటిదురుసుతనం ఎక్కువ. పాపం దీన్ని అనాల్సిన పనేలేదు, ఆ దొడ్డి వాతావరణమేఅంత. అతగాడు ఈమధ్యే గ్రామసర్పంచయ్యాడు. దాని ఊతతో తరవాత చిన్న వ్యాపారమూ ప్రారంభించాడు. అతని చేతిలో కొత్తనీటిలోనిపిత్తపరిగెల్లా పైసా గిలగిల్లాడ్డంమొదలైంది దాంతోఅతగాడు

పట్టణం పట్టి, పల్లెకి చుట్టమైపోయాడు. పెళ్ళాం గొడవ చేస్తే నోరు ముయ్యి మని ఎడాపెడా నాలుగు తగిల్నిస్తాడు. దెబ్బలకి తట్టుకోలే. మొగుడున్నంతసేపూ మౌనంగా ఉంది. అతడు పట్టణం పోం గానే యిరుగుపొరుగు వాడ్ని నానా దుర్భాషలాడుతుంది. వాళ్ళు తన మొగు డితో చాడీలు, పోటీలు చెప్పేసేరని అడిపోస్తూ ఉంటుంది, వాడి పెళ్ళాం. ఆ ఇంటికి వెళ్ళిన క్షణంనుంచీ ఈ పుల్లావు దాని యజమానురాల్ని అనుక రించడం ప్రారంభించింది. అయితే ఈ పరిస్థితిని, ఈ వెనకటి తతంగాన్ని గేదె యెలా గ్రహించగలదు? గ్రహిస్తే మాత్రం పుల్లావు పుల్లవిరుపు మాటల్ని సహించే అవసరం దానికేం వచ్చింది? అందుకని మోరవంచి, ఊపిరి బిగబెట్టి పుల్లావు డొక్కలో గట్టిగా ఒకపోటు పొడిచింది దాంతో 'అంబా' అంటూ అల్లంత దూరాన పడిపోయింది. పుల్లావు మరి నిజం చెప్పాలి కదా, ఆ పోటు దవరుకి నా తోకా కొంచెం తడైంది. దాని పుణ్యమా! అని గేదె అంతటితో అగిపోయింది. 'హమ్మయ్య' అనుకుని 'ఊరకనే నోరు పారేసుకున్నందుకు తగిన శిక్షే అనుభవించింది పుల్లావు' అనుకున్నాను ఈ పుల్లావు ఎప్పుడూ యింతే పెంటమీద్ది యింటి మీదికి తెచ్చుకుంటుంది. దీని సరసన తింటే నాకూ క్షేమం కాదని ప్రక్కన హాయిగా నెమరువేసుకుంటున్న లక్కావు చెంతకుచేరి 'పండగ' విశేషాలేమిటని పలుకరించాను.

పాపం అంతవరకూ అనుభవించిన వ టరితంనికి విసిగిపోయి దా అన్నట్టు నెమరివేసు వెంటనే ఆపేసి, తోకతో చెవుతో ఈగల్ని తోలకుంటూ, దగ్గ రగా వచ్చి 'ఏం చెప్పేది? వ దగనాడూ వస్తు తప్పనేదు'-నిర్లిప్తంగా అంది. మా గోవులగోపన్న యింకా రాదని గ్రహించి ఎందుకు వస్తుం కాల్సివచ్చిందో కొంచెం వివరంగా చెప్పమన్నా. వెం టనే లక్కావు మరింత దగ్గరకు వచ్చి నా మోర దగ్గర మోత పెట్టి నా పొట్ట గురించే అయితే యింతగా విలపించే దాన్ని కాదు. నా బిడ్డని బలవంతంగా బలిగొన్నారనీ కాదు ' అని చెప్పడం ప్రారంభిచేసరికి యిదేదో పెద్దకథలాగే ఉందనుకుని అయ్యో కష్టా, మరి అంటూ కొంచెం జాలిని కనబరచాను.

'నన్ను సొంత సంతానం నాగ సూసుకుంతున్న మా అచ్చియ్యా, లచ్చ మ్మకు దూరమైపోయన్ను, అలజతుకూ నాలాగే మట్టిపాలై పోయింది. ఈ లోకం లోని అంతకాలూ, యవ్వారాలు సూత్తూ వుంటే ఈ మనుసులు కంటే మనవే సాల నయ్యం అని అనుకుంతన్నాను.'

'ఆ సంగతి మన నోటితో ఎందుకు అనడం లెద్దు; అయినా నీ కథ మొదలే పెట్టలేదు.' 'ఆయెందుకు నెద్దూ, పండగ పూట కష్టాలని నెమరేసుకోవడం?'

'అహా అలా వీల్లేదు. నీ కథ మా మూలి కథలా లేదు, మనలో మనం గాక యింకెవరితో మనకష్టాల్ని గురించి చెప్పుకుంటాం?'

అలా అనేసరికి లక్కావూ కష్టాల్ని కడుపులో దాచుకోలేక 'అయితే మరి

సెవొగ్గి యెను అంటూ తన కరుణ గాథని చెప్పుకొగింది.

'నాను పెద్దనోగిట్లోనే పుట్టాను. పెద్దోల దాహం పెద్దగా ఉంటుందన్న సామెత నాగనాకు గుర్తుకు రాదు పాలించకుండానే మా అమ్మ పొదుగుని పిడసలా పిండేస్తూ ఉండేవారు పోనీ గడ్డిపరకలైనా ఏస్తేవారు కాదు. ఆరునెల్లు తిరక్కుండానే తల్లీ పిల్లా యిద్దరం కంది కంపల్లా యెండిపున్నగా అయిపోయాం. వెంటనే సంతకితోలి మమ్మల్ని అమ్మేసారు. నన్ను మాత్రం ఈ ఊరి, అచ్చయ్య గాడు అప్పుచేసి కొనుక్కున్నాడు అదిదీ కూలి బతుకే, అయినా నా కూటికి లోటు రానివ్వనేదు. మా లచ్చుమ్మకి నేనంటే ఒల్లమాలిన పేమ కమ్మని గరి కల్లూ, కడుపునిండా గంజినీళ్లు పెట్టేది దాంతో గుమ్మడిపండులా ఒల్లుసేసాను. కడుపూ పండింది। పండూ దిగింది. నేనొక తల్లినై పోయాను. ఆరోజు అపేటంతా పండుగే అనుకో. మాలచ్చి గడప గడపకీ జున్నుముక్క పంచింది. ఆలందరూ దాన్ని ప్రసాదంలా కల్లకద్దుకొని తిన్నారు. నా యజమాని రుణం తీర్సుకో డానికే అన్నట్టు నావొల్లంతటనీ పొదుగు సేసి బోలెడుపాలు గుమ్మరించేదాన్ని...

ఇంకేం నీ అచ్చయ్య ఇల్లంతా డబ్బన్నమాటే।

రామ రామ అలా అనకు నీ నాలికి తొంం డైపోగల్దు. ఆలకి అలాటి యాపార బుద్ధుల్లేవు. అయినా పెద్దకులత్తులు హరిజనపేటలో పల్లిక్కుగా పాలు కొంతారా యేంటి? ఒకపూట పాలు నా బిడ్డకే ఒగ్గేసేవాడు అచ్చయ్య. రెండోపూటపాలు తోడేసి, కడివెడు సల్లసేసి ఇరుగుపొరుగోళ్లకి పోసేది. మంచంపట్టిన ముసలోళ్లు, రొమ్ముపాలు సాలని సంటోల్ల పాలిట నిజంగా మా లచ్చమ్మ లచ్చిమీదేవే అయింది. అలా అందరూ పొగిడేసరికి నాదేం వుంది, మాలక్కావు దయగాని అని నవ్వేసేది లచ్చుమ్మ ...'

అహా!అలాంటి ఉపకారభావం పెద్దోలందరికీ ఉంటేయెంత బావున్ను.

'నిజవే అనుకో. అల ఆనందం సూస్తూ ఉంటే కలకాలం ఆదొడ్డిలోనే ఉండిపోవాలని కోరుకుంతూ ఉండేదాన్ని కాని మనకోరికలు అన్నీ ఈడేరతాయా సెప్పు?'

'ఏం నీదూడ చచ్చి పోయిందా?' అన్నాను.

ఛా!నీ జిమ్మబడ. ఎంత వొగాయిత్తం మాట అన్నావు?— కస్సుమంటూ సీగ పడిపోయింది లక్కావు.

'ఆ పొరబడ్డాను:లెంపలు వాయించుకుంటానులే. నాబిడ్డ హఠాత్తుగా గతయేడాది చచ్చిపోయాదు కాబట్టి నా మనస్సు అలా ఊహించింది. అంతేమరి' సంజాయిషీ యిచ్చుకున్నారు

'నాబిడ్డకేం. బసవడిలా బొద్దుగా ఉండేది. దాంతో ఊరూ వాడా ఎక్కడయిన్నా నాపేరే; నాకీరితే. నెమ్మదిగా యిదంతా ఈవూరి కామందుగారి పెళ్లాం సెవిలో పడింది. ఆయమ్మ బిడ్డల్నికన డానికే కాని సాకడానికి అమ్మకాదునే. పట్టణం నుంచి సదువుకొని ఒచ్చిందట మరి. తన బిడ్డ పాలుకని నన్ను దొడ్డితో కట్టించమని మొగుడకి ఆర్డరు యిచ్చింది. యెంటనే కామందు అచ్చయ్యకు కబురు

పాపి ఆర్ధాంతరంగా అప్పును సెల్లించ మన్నాడు. కాళ్ళా,యేళ్ళా పడి మరొక యేడాది గడపమన్నాడు యీల్లేదని నన్నూ, నాబిడ్డని బలబరా యీడ్పించి తన దొడ్డిలో కట్టించేసిండు. అంతే నాబం గారంనాంటి బతుకు మట్టిపాలై పోయింది. యేలకి మేత ఉండేదికాదు. కుడితినీలకే వాసిపోయానంటే నమ్ము. పొదుగును మాత్రం మూడుపూటలూ పిడస గుడ్డలా పిండించేస్తూ ఉండేవారు. ఆ అమాసకు వొచ్చానో నేదో యీ అమాసకు నాబిడ్డ గిలగిల తన్నుకొని ప్రాణం ఒగ్గేసింది— లక్కావుజలజలా అశ్రువులు రాల్సింది.

'అయ్యో యెంత ఘోరం, నీ బిడ్డ ఉసురు ఆడిబిడ్డకి తగల్తుంటావా?' అన్నాను.

'అలాంటి శాపనాకారాలు మన పశువుల కెందుకు నెద్దు మరింత పాపం. నేనెంత గోవునైనా ఒల్లు మండింది. పొదుగులో సేయిపెట్టేసరికి ఫెడేలుమని తన్నేసేదాన్ని. దాంతో బసిత్తో బాది, బాదికాళ్ళకి బందనాలుయేసేసి పొదుగు పిండేవారు. అల అగ్యానానికి నవ్వొచ్చేది '

'ఏం ఎందుకని?'

'మనసైతే గదా, పాలివ్వడానికి. నేను మిసన్నా యేంటి?'

అయ్యో నీలాంటి కష్టాలు యింకెవరికీ రాకూడదు మరి. ఈలు ఏం మనుసులు. అనవసరంగా కందిరీగల తుట్టని కదిపినట్టు నీ కష్టాల గాథని జ్ఞాపకం చేసాను. మరేమీ అనకోక, అన్నాను. అప్పటికే గోపన్న వచ్చేసే వేళైంది.

దానికేం గాని, నాకథ నా ఒక్కదాని కథే అనుకోకు అంటూ కంట తడి బెట్టింది లక్కావు.

ఇంతలో మాగోపన్న గేదెమీద కూర్చుంటూ అపర యముడిలా మిగిలిన పశువుల్ని అదిలించుకుంటూ రావడం చూశాను. మంచికాలం రాదామరి అనుకుంటూ బంజరు వైపు ప్రయాణం సాగిచాం నేను లక్కావూ కలిసి

---

## నగ్నసత్యం

మూడాసుల్లో
రేసుల్లో
మా పచ్చి నెత్తురు పచ్చ పచ్చగా
మా రెక్కలు
మీ బొక్కసాల్లో రొక్కం
మా డొక్కంతా పొడుచుకు తిని
మా బొక్కల్ని మీరు గిరవాటేసినా
బొక్కా బొక్కా ఒరుసుకొని
భాసిస్తూ భాస్వరాలు మీకు
భయోత్పాతం కల్గిస్తాయి సుమా.
ఇన బింబాన్ని పదమటి కొండ
మింగానని మిడిసి పడ్డా
కొండ గుండెల్లో అది
రగుల్తూనే వుంటుందని మాత్రం మరవకు

—వరప్రాల శివకుమార్

# రచనా స్వాతంత్ర్యమూ - నిబద్ధతా.

"ఒక వుద్యమంలో జరుగుతున్న అవకతవకల్ని ఎప్పటికప్పుడు బయట పెడుతూ రచనలు సాగించే స్వాతంత్ర్యం రచయితల కుండాలి. దాని వలన ఆ వుద్యమమే బలపడుతుంది. సోల్జినిత్సిన్‌కు రచనా స్వాతంత్ర్యం కలిగించి వుంటే సోవియటులో జీవితం ఇప్పటికన్న త్వరగా, ఇంతకన్న ఉన్నతంగా పెరిగివుండేది"-అంటూ ఒక మిత్రుడు ఇటీవల వ్రాసేరు.

రచయితకు స్వాతంత్ర్యం వుండాలనే విషయంలో అనుమానం అక్కర్లేదు. నువ్వు ఫలానా వ్రాయాలి. ఫలానా వ్రాయకూడదు అనే నిషేధం ఆమోదించ రానిది. ఆ విషయంలో సందేహం ఏమీలేదు. అది స్వాతంత్ర్యానికి సంబంధించిన సమస్య. అందుచేతనే దానిని నిరోధించే ందుకు ప్రయత్నం జరిగినప్పుడల్లా ప్రతిఘటన నెదుర్కోవలసి వస్తుంది తప్పదు.

అయితే ఒక వుద్యమంలో జరుగుతున్న అవకతవకల్ని బయట పెట్టాలనే సంకల్పంలో ఒక మెలిక వుంది. ఏ వుద్యమానికైనా కొన్ని లక్ష్యాలు వుంటాయి. అవి సామాన్య ప్రజోపయోగకరం కావచ్చు, నష్టకరమూ కావచ్చు. సమాజంలోని ఏ వర్గం యొక్క ప్రయోజనాలను రక్షించడానికీ, సాధించడానికీ ఆ వుద్యమం వుద్దేశించబడిందనే ప్రశ్నను బట్టి దాని ప్రజోపయోగిత నిర్ధారణ అవుతుంది. అందుచేత మనం కోరే రచయితల స్వాతంత్ర్యం కేవలం స్వాతంత్ర్య సమస్యే కాదు. రచయిత యొక్క నిబద్ధతకు సంబంధించిన సమస్య కూడాను. దీనిని స్పష్ట పరిచేందుకు సోల్జనిత్సిన్‌నో, వేరొకరినో తీసుకొని వుపయోగంలేదు. ఆయన పుస్తకాలు చదివిన వాళ్ళు తక్కువ, చదవకుండానే అటో యిటో అభిమానాలు పెంచుకున్న వాళ్ళు ఎక్కువాను. కనక మనకు దగ్గరగావుండే వారినే తీసుకొందాం.

మనం అందరం అభిమానించే శ్రీ రాచకొండ విశ్వనాధశాస్త్రిగారి రచనలు తీసుకొందాం. ఆయన నిబద్ధ రచయిత. ప్రస్తుత సామాజిక వ్యవస్థ ఒకరినొకరు మానవులు దోచుకొనేందుకు అవకాశాలు కల్పించేది మాత్రమేనని ఆయన విశ్వసిస్తున్నారు, అది నిజమే కూడ. అట్టడుగు మానిసి గురి అవుతున్న అన్యాయాలకు ఆయన వ్యధ ప్రకటిస్తున్నారు. వాళ్ళకు న్యాయం కలగాలంటే ఈ వ్యవస్థను రద్దు చేయాలంటారు. రద్దు చేయడానికి గల ఏకైక మార్గం విప్లవమే నంటారు. ఆయన నిబద్ధత స్వరూపం ఇది.

"అవంతి"

ఇక్కడ మనం కొన్ని విషయాలను అర్థంచేసుకోవాలి. విప్లవాలు తాత్కాలిక ఆవేశాల ఫలితంగా రావచ్చు. పరిపాలకుల్ని మార్చడం వరకే అయితే అటువంటి విప్లవాలు సాధించగలవు. కాని ఒక వ్యవస్థనే మార్చగలిగేటట్లు విప్లవం కొనసాగాలంటే దాని లక్ష్యాలు నిర్దిష్టంగా వుండాలి. ఆ లక్ష్యసాధనకై విప్లవాన్ని నడపగల నాయకత్వమూ వుండాలి. ఇవి రెండూ లేనినాడు భిన్నప్రయోజనాల సంఘర్షణలలో వుద్యమం కుప్పకూలిపోతుంది.

లక్ష్యశుద్ధి, బలమైన నాయకత్వమూవున్నా,వుద్యమం సరళరేఖలో సాగదు. భిన్నవిభిన్న సామాజిక పరిస్థితులలో విజయాలు, ఓటములు, రాజీలు, తిరోగమనాలు ఎదుర్కోవలసి వుంటుంది. ఎదురయ్యే ప్రతిదశనూ, అంతర్దశనూ అందరూ ఒక రీతిగా అంచనా వెయ్యడం జరగదు. భిన్నాభిప్రాయాలుంటాయి. ఇదితప్పదు.

రా.వి. శాస్త్రిగారి 'గోవులొస్తున్నాయి','పిపీలికం'వంటికథలలో,తిరుగుబాట్లు యదృచ్ఛికాలు (Spontenious) వాని విజయాన్ని చిత్రించడం యాదృచ్ఛికతను సమర్థించడం కాదు. శాస్త్రిగారి నిబద్ధతకది సంకేతం. అంతే.

అయితే ఆయన 'వేతనశర్మ', 'పాతకథే' మొదలైన కథలలో వుద్యమ నాయకత్వాన్ని ద్రోహుల జాబితాలో చేర్చడం చూస్తాం. ఆ నాయకుల్ని ద్రోహుల్నిగా చిత్రించడం (వేతనశర్మలో), దొంగల్నిగా పేర్కొడం (పాతకథలో) జరుగుతుంది వుద్యమ గతిలో ఏర్పడే దశల్ని, అంతర్దశల్ని అర్థంచేసుకోడంలో వుండే వైవిధ్యమనే దొక్కటే కాదు, అసలు నాయకులలో స్వార్థపరులు కొందరు చేరవచ్చు. ద్రోహులూ తయారుకావచ్చు. కానీ అందర్నీ స్వార్థపరుల్నిగా, దొంగల్నిగా చిత్రించడం, పేర్కొడం వుద్యమానికి నాయకత్వం అక్కర్లేదన్నట్లుగా అవుతుంది. యదృచ్ఛాగతిని సమర్థించడం అవుతుంది. ఈ పరిణామం వుద్యమ విజయానికి తోడ్పడదు. ఇక్కడ రచయిత వుద్యమ నాయకత్వాన్ని మొత్తంగా నిందించడం, నిరాకరించడం ఆయన స్వాతంత్ర్యానికి సంబంధించిన సమస్యకాదు నిబద్ధతకు సంబంధించిన సమస్యగాని. నిబద్ధత స్వాతంత్ర్యాన్ని నిరోధించదు, భంగించదు. రచనా స్వాతంత్ర్యాన్ని ఫలవంతం చేస్తుందిగాని.

మరొక వుదాహరణ సిస్తాం. 1972 ఫిబ్రవరిలో చెరబండ రాజుగారి "బంగ్లా ప్రజలకు బహిరంగలేఖ" గేయాన్ని సృజన ప్రచురించింది. బాంగ్లా ప్రజ యాహ్యాఖాన్ దురంత చర్యలను ఎదుర్కొని సాగిస్తున్న పోరాటానికి భారత ప్రభుత్వం ఆ నాడు వత్తాసు నిచ్చింది. కేవలం నైతికమైన తోడ్పాటుకాదు. ఆర్థికంగా, సైనికంగా, రాజకీయంగా అపారమైన సహాయం చేసింది. ఆ సందర్భంలో భారత

ప్రభుత్వం మీద బాంగ్లా ప్రజలకు అనుమానం కలిగించడం వారి పోరాటాన్ని భంగపరచడానికి సాయపడుతుందే గాని బలపరచదు.

"మీ కన్నీళ్ళు తుడిచే చేతి వేళ్ళను
ప్రశ్నించండి, దోపిడి వ్యతిరేక
శక్తుల్ని అవి ఎందుకు పొట్టన
పెట్టుకుంటున్నాయో...."

అని ఆయన బాంగ్లా ప్రజలకు సలహా ఇచ్చారు, ఆ గీతంలో.

"బాంగ్లా ప్రజల పోరాటం యెడ ఇంత అభిమానం చూపుతున్న నువ్వు నీదే శంలో ప్రజాపుద్యమాల్ని ఎందుకు అణిచేస్తున్నావని" భారతప్రభుత్వాన్ని చెరబండరాజు గారు ప్రశ్నించడం న్యాయం. చెయ్యవలసిందది. అప్పుడా కవిత విలువ మరొకలావుండేది. అలాగాక—

"సామ్యవాద వసంతాన్ని
జపిస్తున్న కొంగల జీవకారుణ్య
నయగారాలకు మోసపోవద్దు"

అని హెచ్చరించడం తప్పు. అలా వ్రాయకూడదంటాను.

వ్రాయ కూడదనడం స్వాతంత్ర్యాన్ని భంగించడంకాదు, ఔచిత్యాన్ని గుర్తు చేయడం. నిబద్ధతను సవాలు చేయడమూను "కాదు. అది రచయిత స్వాతంత్ర్యానికి సవాలుగానే భావిస్తా"ననడం రచయిత నిబద్ధతను నిరాకరించడం తప్పవేరుకాదు ఆస్వాతంత్ర్యం వుద్యమానికి పుష్టినివ్వదు, దాన్నిభగ్నం చేస్తుంది.

---

# కొందరి జీవితాలు

అట్టడుగు వారి జీవితాలు
డస్టుబిన్‌లో కాగితాలు
వాళ్ళ ఆశలు-
ఆ కాగితాలమీద రాతలు

ఉన్నత శ్రేణి జీవితాల కోసం
పేపరు మిల్లు పొట్టంలో
మళ్ళీ ఊపిరి పీల్చుకుంటాయి

—కొల్లూరి

స్కెచ్

# ఫైవ్ నాట్ ఫోర్

—టి. యల్. నరసింహారావు

పాపయ్య తన పేరు మరచిపోయి. పదేళ్ళయింది. పోలీసుస్టేషన్‌లో అడుగు పెట్టి, ఎస్.ఐ. అందించిన అరవీస బరువు బుట్టటోపీ నెత్తిన పెట్టుకొని, గజం పాతిక పొడుగు దుడ్డుకర్ర చేతిలోకి తీసుకున్న మరుక్షణం పాపయ్య కాస్తా ఫైవ్ నాట్ ఫోర్ అయిపోయాడు. విక్టోరియా రాణి కిరీటం పెట్టుకొన్న రోజు కుంపినీ రాజ్యానికి పండగ రోజైతే తనకూ తన పెళ్ళాం లచ్చిమికీ యిది పండుగ రోజనుకొన్నాడు పాపయ్య.

హెడ్డుగానీ, ఎస్.ఐగానీ తనపైవాడు ఎవడైనా సరే. వాడినోట "ఫైవ్ నాట్‌ఫోర్" అన్న అంకె వినబడితే చాలు పాపయ్య బూట్లు మడమలు తక్కున చప్పుడుచేసేవి. శరీరం అమాంతం బిగుసుకు పోయేది. కుడిచేయి, మీట నొక్కినంత వేగంగా మొగానికి అడ్డంపోయి సెల్యూట్ కొట్టేది.

ఫైవ్ నాట్‌ఫోర్ బజార్న నడుస్తుంటే చూసేవారికి, లాఅండ్ ఆర్డర్ భారమంతా అతడు తన భుజాల మీద, కాకపోతే నెత్తిమీద మోస్తున్నట్లుండేది. పాపిష్టి భూభారాన్ని నెత్తినెత్తుకొని మోస్తున్న ఆదిశేషుడి అకారం వారి మనస్సులో మెదిలేది. అతడి చేతిలో లాఠీ అనుక్షణం అదో వయ్యారంగా నాట్యమాడుతుండేది.

పాపయ్యకు దస్సులో వున్నప్పుడు తాను బాగా ఎరిగిన మనుషుల పేర్లు కూడా గమనంలో వుండేవికావు. చిన్నప్పుడు వీధిబళ్లో కలసి చదువుకొన్న రిక్షా తొక్కే రాముడు తారసిల్లితే "ఏయ్ రిక్షా" "అని పిలిచేవాడు. తనపొరుగింటి లారీ డ్రైవర్ రంగయ్యను "ఏయ్‌లారీ" అని కేక వేసేవాడు. ఇంటికి రాగానే, గదపల్లో మంచాన పడివున్న ముసిలాడు "పాపడూ, వచ్చావా? "అని నోరారా పలకరిస్తే, క్షణంసేపు"ఎవర్నీ" అన్నట్టు బిత్తర పోయిచూచేవాడు తనకొడుకు ఆరేళ్ళవాడు యిరుగు పొరుగు పాకల్లోని పిల్లల్తో గోలికాయలాడుతుంటే "అణ్ణి లేబరోళ్ళతో తిరగనివ్వమాక ....

ఆళ్ళ బుద్ధులే ఈడికీ అబ్బుతాయని" తన పెళ్ళాన్ని మందలించేవాడు. కాస్త హుషారుతోచినప్పుడు. వాణ్ణి మంచంలో తన పక్కన పడుకోపెట్టుకొని.

"నువ్వు బాగా సదువుకోవాలి .... మనీక్లేపను పాసై ఎస్సైఆయిపోవాలి" అని బుద్ధులు చెప్పేవాడు. లచ్చిమిని పాకల్లో ఆడంగులంతా "పోలీసాయన పెళ్ళాం" అనిపిలుస్తుంటే, ఆమెవాళ్ళతో మాట్లాడేటప్పుడు తన మొగుడి గురించి చెప్పాల్సొస్తే "మాపోలీసాయన "అంటుంటే ఫైవ్ నాట్‌ఫోర్ ఉరఫ్ పాపయ్య

ఆనందానికి పట్ట పగ్గాలుండేవి కాదు. పాపయ్యకు పైవాళ్ళను చూస్తే ఆకాశంలో మిలమిల్లాడే చుక్కల్ని చూసినట్లుండేది. రిక్షా తొక్కే రాముణ్ణి, లారీతోలే రంగయ్యనూ, యిలాంటి ఆమాంబాపతును చూస్తే చీమల్నీ, దోమల్నీ చూచినట్లుండేది. కిందటేడు పెద్దబజారులో కొట్ల దగ్గర దొమ్మీ జరిగినప్పుడూ, లారీ డ్రైవర్లు సమ్మె కట్టినప్పుడూ, యింకా యిలానే చాలా సార్లు రామయ్య మీదా, రంగయ్యలమీదా పాపయ్య తన లారీని నాట్యం చేయించాడు.

విన్న ప్రొద్దు గూకే వేళ్ళప్పుడు పాపయ్య ఆకలితో అవురావురు మంటూ పాకకు తిరిగొచ్చి, గడపల్లోనుంచే, "లచ్చీ, బేగి బువ్వొంచు, కడుపుకాలిపోనాది" అనికేక పెట్టాడు.

"ఈ పూటనూకలు సిక్కనేలేదయ్యోయ్, పోలీసాయనా "అని కుండలు కడుక్కుంటున్న లచ్చి జవాబువిని ఫైవ్ నాట్ ఫోర్ నీరుకారిపోయాడు ....బుట్టటోపీతీసి వంకెన తగిలించాడు. నడుము బెల్టు తీసి కుక్కిమంచం మీదికి విసిరేసాడు ప్రొద్దుటినుంచీ పొట్టను నాయకట్టి వుంచిన బెల్టు కాస్తే తొలగిపోయేసరికి అతడి పేగులు గుర్రుమన్నాయి. వంకీనున్న సంచి తీద్దామని తలపైకెత్తేసరికి మిలమిల మెరుస్తున్న ఫైవ్ నాట్ ఫోర్ యిత్తడిబిళ్ళ అతణ్ణి వెక్కిరించింది. ఫైవ్ నాట్ ఫోర్ పాపయ్యగా మారి, సంచీ చేత పుచ్చుకొని సందులోకొచ్చాడు.

---

# పరీవాహం

గస్తీ....గస్తీ...గస్తీ....
కడిగి ఆరేసిన పేగుల
సముద్రపు ఘర్జన,
కన్నీటి కడలిలో
కల్లోలిత కెరటాల్లా
కళ్ళల్లో కమ్మిన రక్తపుమరకలు,
కణకణావిష్ణ, నరనరాన్ని
నమిలేసే చలిలో
భవిష్యదాలోచనల ఫర్నేసులో
మసలు తున్నజీవచ్ఛవాల మస్తిష్కాలు:
శీతలీ కరణ గదుల్లో
నిద్ర రాక
పట్టు పాన్పులపై పొర్లే
కుత్తుకదాక నెత్తురు కక్కిన
జలగలకు
గస్తీ....గస్తీ...గస్తీ....
ఈ సముద్రం వుప్పొంగితే,
ఈ కడలికి కట్టలు తెగిత్తే,
ఈ జీవచ్ఛవాలే విజృంభిస్తే
మరిక—
నాస్తి...నాస్తి....నాస్తి....

—సవేరా

# చలం-స్త్రీ

చలం అంటూనే స్త్రీ విముక్తికోసం కలం పట్టిన రచయిత అన్నది వెంటనే గుర్తువచ్చే విషయం పాఠకునికి.

చలం కలం పట్టిన కాలంలోనూ అంతకు మునుపూ స్త్రీల యొక్క పరిస్థితులు చాలా నికృష్టంగా వుండినాయి. ఫ్యూడల్ వ్యవస్థలో ఆ సంస్కృతి పేరుతో సర్వ విధాల అణచబడివుంది స్త్రీ. సమాజం ఆర్థికంగా పెట్టుబడిదారీ వ్యవస్థలోకి మారుతున్నప్పటికీ ఆనాడు ఫ్యూడల్ సంస్కృతి రాజ్యం చేస్తూంది. ఆ సంధి యుగంలో స్త్రీల పరిస్థితి మరీ అధ్వాన్నంగ తయారయింది. విద్య- విజ్ఞానాలు బొత్తిగా లేక ఆచార సంప్రదాయాల పేర వంట యింటికీ, పడకటింటికి బందీఅయి మరో వైపు పురుషాహంకారం చేత ఒక వ్యక్తిత్వం అనే మాటే లేకుండ పూర్తిగా బానిస స్థితికి నెట్టబడివుంది. పారిశ్రామిక వ్యవస్థ పూర్తిగ ఏర్పడని ఆ కాలంలో ఇండియన్ ప్రొలిటేరియట్ స్త్రీయే అని సరిగ్గ అన్నారు మహా సంస్కర్త రాజా రామమోహనరాయ్. స్త్రీల పరిస్థితి బాగుపడటానికి కృషిచేయటం ప్రథమ కర్తవ్యంగా భావించుకున్నారు ఆనాటి సంస్కర్తలు.

ఆంధ్రదేశంలో వీరేశలింగం పంతులుగారు ఈ విషయంగ ఎనలేని కృషి చేశారు. సంస్కరణోద్యమ ప్రభావం ఆనాటి పలువురు రచయితల మీద సహజంగా ప్రసరించింది. భావుకుడు సంవేదనాశీలి అయిన చలం ఈ ప్రభావానికి లోనైనవాడే. సాహిత్య సృష్టికి చలానికి ప్రేరణ నిచ్చింది – స్త్రీల నికృష్ట పరిస్థితుల పట్ల ఆయన హృదయం చలించి ఆవేదన చెందటమే. ఆయన తీవ్ర ధోరణితో సమాజంమీద దండెత్తాడు. సమకాలీన సమాజాన్ని తన సాహిత్యంతో సంచలనంలో ముంచెత్తాడు. ఆయన వెదజల్లిన తిరుగుబాటు భావాలవల్ల ఆయనకు ఎదురైన వ్యతిరేకత అంతాయింతా కాదు.

సనాతన ఆర్యభూమి – పవిత్ర భారతదేశం స్త్రీని పాతివ్రత్యం పేర వేనోళ్ళ బంధించి ఆమె వ్యక్తిత్వాన్ని రూపుమాపిన పరిస్థితికి చలం క్రుద్ధుడై "ఈ దేశంలో ఆడదిఅయి పుట్టటమే ఎంత నీచం?" అని వాపోతాడు. ('దైవమిచ్చిన భార్య') "స్త్రీ పురుషుని సొమ్మా? ఒక మనిషి యింకొక మనిషి ఆస్తియెలా అవుతుంది? అనాగరకులదీ, మూర్ఖులదీనూ ఈ అభిప్రాయం. పిరికి వాళ్ళు అర్థంలేని

—శ్రీమతి పి. సంజీవమ్మ.

పూర్వాచారాల్ని పట్టుకు వేళ్ళాడేవాళ్ళు కావడంచేత ఈ రోజుల్లో యింకా స్త్రీలు పురుషుల ఆస్తిలో జమకట్టబడుతున్నారు" అంటాడు (అదే నవలలో). స్త్రీ విషయంగ ఫ్యూడల్ భావాల మీద తిరుగుబాటు ప్రకటించాడు చలం తన రచనల్లో.

బాల్య వివాహాల్ని, ప్రేమలేని వివాహాల్ని, వివాహంపేర కేవలం పురుషుని కామం అనే అవసరాన్ని తీర్చి అతనికి సేవలుచేస్తూ పిల్లల్నికనే యంత్రంగా తయారయిన స్త్రీ పరిస్థితిని తీవ్రంగ గర్హించాడు చలం. ప్రేమలేని వివాహాల్ని-యంత్రాల్లాగ కామం తీర్చుకొనేందుకు పనికివచ్చే వివాహ వ్యవస్థని అసహ్యించుకున్నాడు. అంతేకాని కొందరు విమర్శకులు భావించినట్లుగా చలం వివాహ వ్యవస్థ అవసరం లేదంటున్నాడు అనటం పొరపాటు అవుతుంది. అతడు ప్రేమ ప్రాతిపదికగ కలిగిన వివాహ వ్యవస్థని వాంఛించాడు. ప్రేమికులు పెళ్ళిళ్ళు చేసుకునే అవకాశంలేక, లేదా ఒకటిగ జీవించే అవకాశం లేక సంఘం కోసం పరువు పేర ట్రాజిక్ జీవితాన్ని గడుపుతూ బలిఅయిపోతున్న పరిస్థితిని భరించలేని అతని భావుకమైన సంవేదనా భరితమైన హృదయం తన స్త్రీ పాత్రలకి తిరుగుబాటును నేర్పింది ; లేచిపొమ్మని బోధించింది ; సంఘపు కట్టుబాట్లని తెంచుకొని స్వేచ్ఛగా సంచరించమన్నది ఈ తీవ్రతని గమనించినప్పుడు ఆయన అలాంటి విశృంఖలమైన వ్యవస్థను కోరుతున్నాడా అని భ్రమ పడవచ్చు. కాని సహృదయంతో విమర్శించ కలిగి నప్పుడు-ఈ కుళ్ళిన వ్యవస్థనీ ఆచారాల్నీ - వీటికోసం స్త్రీలు బలి కావడాన్ని భరించలేని అతని సెన్సిటివ్ నెస్ వాళ్ళని తిరగబడ మంటూంది అని గ్రహించవచ్చు. అక్రూరకురాని, వృత్త తంతుగ మాత్రమే తయారయిన సంప్రదాయ వివాహ వ్యవస్థని - అది స్త్రీలకి ఒక బానిస సంకెలగా తయారయివున్న పరిస్థితిని చలం అసహ్యించు కున్నాడు. అంతేకాని వివాహం అనేది ప్రేమ ప్రాతిపదికగ కలిగి, స్త్రీ పురుషుల స్వాతంత్ర్యాన్ని సమానత్వాన్ని వ్యక్తిత్వాన్ని గౌరవించేదిగా తయారయితే అలాంటి వ్యవస్థని ఆహ్వానించటంలో మొదటి వాడుగ వుంటాడు చలం. ఆయన అభిలషించిందీ అదే. అయితే అతని రచనలు ఈ కుళ్ళిన వ్యవస్థని తీవ్రంగా గర్హించటంతోటీ, పాత్రల్ని తిరుగుబాటు చేయించటంతోటీ నిండి వుంటాయి తప్ప నూతన వ్యవస్థ నిర్మాణ లక్ష్యాన్ని గురించిన వాస్తవికమైన ఆలోచనలు అతని సృజనాత్మక రచనల్లో కనిపించవు. సామాజిక వ్యవస్థా పరిణామాన్ని గురించి చారిత్రకమైన శాస్త్రీయమైన అవగాహన లేనందువల్ల అతని ఆలోచనల్లో రచనల్లో ఈ లోపంచోటుచేసుకున్నది. కొడవటిగంటి వారన్నారు-"చలం జీవిత సత్యాలు ఏవీ చెప్పలేదు కాని, జీవితంలోని అసత్యాల్ని తీవ్రంగ ఖండించినాడు" అని. అయితే చలం స్త్రీలకు జరుగుతున్న అన్యాయాల్నీ నీతి వేషం వేసుకున్న సమాజాన్ని, అసహ్యమైన వాతావరణాన్ని తన రచనల్లో ఘాటుగ ఖండించడం ద్వారా పాఠకుల్ని ఆలోచింపచేయగలిగాడు- సమాజంలో స్త్రీ పరిస్థితుల్ని గురించి.

సౌందర్యానుభూతి పరమైన ఆరోగ్యవంతమైన స్వేచ్ఛాయుతమైన సెక్సు జీవితం స్త్రీ పురుషుల మధ్య వుండాలని గాఢంగ ఇశించాడు చలం. కొందరు భావించినట్లుగా చలం కేవలం కామాన్ని గురించే రచనలుచేసి వున్నట్లయితే ఇంత కాలం ఆ రచనలు నిలిచి వుండేవి కావు అయితే కొన్ని రచనలు మోతాదు మించిన. ఏవగింపు కలిగించే శృంగార వర్ణనలతో నిండి వుండటమూ కాదనలేము. 'మైదానం' లాంటి రచనలు. ఆయా పాత్రల మధ్య ప్రేమఅనుకోబడుతూన్నది-సౌందర్య దాహం వున్నప్పటికీ - సెక్సు ఆకర్షణ ప్రబలంగ వుండటం అని గమనిస్తాము. అవి విషయ లోలత్వంగ దిగజారడం కూడ చూస్తాము కొన్నిచోట్ల. ప్రపంచంలో వున్నది స్త్రీ పురుష సంబంధాలు మాత్రమే కాబోలు అనిపించేలా ప్రవర్తిస్తాయి కొన్ని పాత్రలు. ఇలాంటి ఆ కర్షణలకే చలం సాహిత్యాన్ని చదివి ఎంజాయ్ చేసే పాఠక వర్గమూ తయారయింది ఆయనకి. ఇది ఆయనకి అన్యాయం జరగటమే. అయినా కాదనలేము. సంప్రదాయ వాదులు చలాన్ని ఎదుర్కొనటానికి ఈ విశృంఖలత్వం ఒక కారణం. అసలు కారణం వివాహ వ్యవస్థ మీద చలం దెబ్బకొట్టడం. అయితే చలం ఇలాంటి వర్ణనలు చేయటం ఏదో అనాలోచితంగానో స్పృహ లేకుండానో చేయలేదు. కుళ్ళిన ఆచార సంప్రదాయ వ్యవస్థ మీద, వాటిని ఆకాశానికి ఎత్తుతూ ప్రశంసించి-ఆ వ్యవస్థే గొప్పదని దాన్ని నిలుపుకోటానికి ప్రాకులాడే సనాతన వాదులమీద చలానికి విపరీతమైన కసి, ద్వేషం. తననీ, తన రచనల్ని ఎదిరించే వాళ్ళని దెబ్బకొట్టడం అతని వుద్దేశం. తరతరాల పురుషాహంకారం అంటే తగని మంట. అందువల్ల అతని మొదటి రచనల్లో పాక్షికమైన అభిప్రాయాలు తిట్లూ అనవసరమైన శృంగారమూ చోటుచేసుకున్నాయి. ఈ విషయం చలం ('స్త్రీ'కి రెండో మాటలో) స్వయంగ చెప్పుకున్నాడు. భావుకుడూ తీవ్రవాదీ అయిన రచయిత రియాక్షన్ ఇది; వాస్తవికతా దృక్పథం కలిగిన రచయిత రెస్పాన్స్కాదు. కాని తరువాత చలం తన బాధ్యతనూ గుర్తించాడు. తనని ప్రశ్నిస్తున్న వారూ, తన రచనల్ని మాటల్ని విలువగా గ్రహించేవారూ వస్తున్నారని తెలియగానే 'తన కాళ్ళకి బంధాలు పడ్డాయని నిర్విచారపు స్వేచ్ఛా ప్రయాణం ముగిసిందనీ. అజాగ్రత్తగా ఏం వ్రాసి ఏం మాట్లాడి, ఏం వ్రాయక ఏం మాట్లాడక mislead చేస్తానో అని భయం' అన్నాడు ('స్త్రీ' కి రెండో మాట లోనే).

సాధారణంగా చలం రచనల్లో పాత్రల జీవితం సెక్సుకి ప్రాధాన్యం యిచ్చి చిత్రింపబడుతూ వచ్చింది. వాటికి సామాజిక జీవితం అరుదుగా కన్పిస్తుంది. ముఖ్యంగా స్త్రీ పాత్రలు సామాజిక వ్యక్తులుగా చిత్రింపబడలేదు. స్త్రీకి సెక్సు స్వేచ్ఛే విముక్తి అనుకుంటున్నారా అని పాఠకులు భ్రమపడే అవకాశం వుంది. వారి జీవితంలో సెక్సు కోణానికి యివ్వబడినంత ప్రాధాన్యం సామాజిక సంబంధమైన సమస్యలకి ఇవ్వబడలేదు. ఇందుకు కారణమూ గమనించవచ్చు.

ఫ్యూడల్ వ్యవస్థలో - ఆ వ్యవస్థ క్షీణదశలో స్త్రీ ఏమాత్రం వ్యక్తిత్వం లేని మనిషిగా - ముఖ్యంగా సెక్స్ పరంగా బానిసవలె యంత్రంలాగ చూడబడిన పరిస్థితి వుండింది. ( అది ఈనాటూ అంతో యింతో లేకపోలేదు ) పురుషాహంకారం ఆమెకూ మనసూ కోరికలూ వున్నాయని గుర్తించలేదని చలం ఆవేదన. అందువల్ల పురుషాహంకారం మీద, సమాజంమీద, సెక్స్ పరంగానే స్త్రీ చేత దెబ్బ కొట్టించాలనుకున్నాడు అనిపిస్తుంది.

మరోవిధమైన భ్రమకూడా పాఠకులకు చలం రచనల వల్ల కలిగే అవకాశం వుంది స్త్రీ కష్టాలకి ఆమె బానిస స్థితి కి ప్రధానంగా పురుషుడే కారణం అన్నట్టు వంటిది. అతని స్త్రీ పాత్రలు సమాజాన్ని కూడ విమర్శిస్తాయి, తిడతాయి. కాని ఎక్కువగా విమర్శ పురుషుని మీద కేంద్రీకరింపబడి వుంటుంది పురుషుడు ఆవిధంగా ప్రవర్తించ కలిగిన సామాజిక వాతావరణ - సామాజిక వ్యవస్థను గురించి చలం ఆలోచనలు శాస్త్రీయంగా ఎదగలేదు. ఆది ఫ్యూడల్ సంస్కృతి స్వభావం అని చలం అవగాహనకు లేదు - అందువల్ల పురుషుడు స్త్రీపట్ల తనప్రవర్తన ని మార్చుకొని ఆమె వ్యక్తిత్వాన్ని గుర్తించి తనతో సమానంగా గౌరవించ కలిగితే ఆమెకు విముక్తి లభిస్తుందని పాఠకులు భావించటానికి ఆస్కారం కలిగించాడు తన రచనల్లో. అసలు స్త్రీసమస్యలకి పునాది సామాజిక వ్యవస్థలోనే వున్న లోపం అని చలం ఆలోచనలకి అందలేదు. అందువల్ల వ్యవస్థ మారితే తప్ప స్త్రీకి పూర్ణముక్తి లేదు అన్న అవగాహన పాఠకలకి కలిగించలేకపోయాడు. ఎంతసేపూ స్త్రీకష్టాలకి ఈ సంఘమూ పురుషుడూ కారణం అన్న విమర్శ కనిపిస్తుందితప్ప - సామాజిక వ్యవస్థ-దాని పరిణామాల్నిగురించిన చారిత్రక భౌతికవాద దృక్పథం చలానికిలేదు.

అందువల్ల అతని రచనల్లో మరోలోపం కూడ కనిపిస్తుంది. అది-వ్యక్తులు తప్ప సమాజానికి, సామాజిక వాతావరణ చిత్రణకు ప్రాధాన్యం లేకపోవడం. అవ్యక్తులూ సామాజిక వ్యక్తులు అనిపించరు. సమాజంలో బ్రతుకుతున్న వాళ్ళలాగా అనిపించరు. అక్కడక్కడ సమాజం తొంగి చూచినా అది వ్యక్తిగతమైన దృష్టితో విమర్శింపబడటానికే కనిపిస్తుంది చలం రచనల్లో.

అయితే చలం ఆలోచనల్లో అభ్యుదయకరమైన అంశాలు వున్నాయి. 'స్త్రీ' మొదలైన రచనల్లో విద్య, ఆర్థిక స్వాతంత్ర్యమూ స్త్రీకి అత్యవసరం - అని చాలా సార్లు నొక్కిచెప్పాడు. స్త్రీ విముక్తికి ఇవి పునాది అన్నాడు. ఫ్యూడల్ వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థకు పరిణామం చెంది-ఆధునికస్త్రీ కొంతవిద్యా ఆర్థిక స్వాతంత్ర్యమూ సంపాదించింది. అయితే ఈ ఆధునికస్త్రీ ఫ్యాషన్స్ కోసమూ, పేరూ మర్యాదా డబ్బు కోసమూ దాస్యంచేసే వ్యక్తిగా తయారయిందని ఈసడించాడు, విమర్శించాడు, బాధపడ్డాడు చలం. ఈ మార్పుకైనా స్త్రీలు వ్యక్తిగతంగా కారణం కాదని అర్థంచేసుకో

న్నట్లులేదు. ఈ సమాజంలో పురుషులు అధికారానికీ డబ్బుకు దాసోహమంటున్నా రని విమర్శించాడు. డబ్బుకు ఎక్కడలేని ప్రాధాన్యం కలిగింది ఈ సంఘంలో అని అసహ్యపడ్డాడు. అయితే వ్యక్తులుగా ఈ స్త్రీ పురుషుల ప్రవర్తనకీ ఆలోచనలకీ పెట్టుబడిదారీ వ్యవస్థకీ వున్న సంబంధాన్ని చలం గ్రహించినట్లులేదు. ఈ వ్యవస్థలో డబ్బుకున్న ప్రాధాన్యం, విలువ మనుషులకు వుండదు. సాంస్కృతిక విలువలన్ని డబ్బుతో ముడిపడివుంటాయి. అందువల్ల స్త్రీ పురుషుల ప్రవర్తనకీ ఆలోచనలకీ వాళ్ళని వ్యక్తిగతంగా తప్పుపట్టి ప్రయోజనంలేదు వ్యవస్థలో మార్పువస్తే తప్ప ఆయా సమస్యలకి పరిష్కారం పూర్తిగాలభించదు.

ఈ బూర్జువా నాగరికతలో వివాహానికి ప్రేమప్రాతి పదికగా వుండాలి అన్న ఆదర్శం వుంది. అయితే ఈ వ్యవస్థలో అదెంతవరకు ఆచరణ సాధ్యం అన్నదే ప్రశ్న. ఆర్థికంగా పూర్తిస్వతంత్రురాలు కాలేనిస్త్రీ, నిత్యమూ దేనికో ఒకదానికి పురుషుని మీద ఆధారపడవలసిన పరిస్థితిలో వున్నస్త్రీ- విలువలన్నీ డబ్బుచుట్టూ తిరుగుతూ వున్న వ్యవస్థలో ప్రేమతో మాత్రమే వివాహసంబంధం కలిగివుండటానికి ఏవిధంగా సాధ్యం అవుతుంది? ఎన్ని కుటుంబాల్లో ఎన్ని వివాహాల్లో 'ప్రేమ' అనే పదార్థం ప్రాధాన్యం వహిస్తుంది? స్త్రీ విలువనూ డబ్బుతో ముడిపెడుతూ వుండటం సాధారణంగా జరుగుతూవున్నదే.

స్త్రీ స్వాతంత్ర్యానికీ - సాంఘిక వ్యవస్థకీ వున్న సంబంధాన్ని స్పష్టంగా అవగాహన చేసుకోలేకపోవటం చలం ఆలోచనల్లోని లోపం. ఫ్యూడల్ దురాచారాల నుండి స్త్రీ కొంతవరకు విముక్తి అయినా పెట్టుబడి దారీ వ్యవస్థ ఆమెకు మరికొన్ని కష్టాల్ని కొని తెచ్చింది. అయితే ఈ కష్టాలతో పాటు ఆమెకు విద్య, ఆర్థిక స్వాతంత్ర్యమూ లభించే అవకాశం ఈ వ్యవస్థలో కలిగింది. అందువల్ల ఆమె తన బాధ్యతల్ని గుర్తించుకొని ముందుకు సాగేందుకు వీలుంది. పెట్టుబడి దారీ సంకెళ్ళ నుండి విముక్తం కావలసిన పెద్దవర్గమే వుంది సమాజంలో. అందులో కోట్ల మంది స్త్రీలు. పేదరికం నుండి, అన్యాయం నుండి, అవినీతి నుండి, సమాజం విముక్తం అయినప్పుడు స్త్రీ విముక్తికి మార్గం సుకరం అవుతుంది. మానవ సంబంధాలు డబ్బుతో ముడిపడకుండ వుండ గలిగిన వ్యవస్థలోనే అందరికీ ముక్తి.

ఆర్థికావసరాల మూలంగా కాని, సామాజిక వ్యవస్థ కల్పించిన అధికారం (వివాహ వ్యవస్థ పేరుతో) మూల గా కాని మగవానికి స్త్రీ స్వాధీన కావలసిన అవసరం లేనప్పుడు, ప్రేమతో తప్ప స్త్రీ మగవాన్ని చేరవలసిన అవసరం రానప్పుడు స్త్రీ నిజమైన స్వాతంత్ర్యానికి మార్గం ఏర్పడుతుంది. అలాంటి అవకాశం కల్పించ కలిగిన వ్యవస్థ కమ్యూనిష్టు వ్యవస్థ. సొంత ఆస్తులను రద్దుచేసి భర్తమీద భార్య, తల్లిదండ్రుల మీద పిల్లలు ఆర్థికంగా ఆధారపడే అవసరం లేకుండ చేయ కలిగిన వ్యవస్థ అది.

చలం రచనల్లో యథార్థ జీవిత చిత్రణ, జీవిత వాస్తవికత లోపించింది అన్న విమర్శ వుంది. స్త్రీ కూడ ఒక మనిషి – పురుషుని లాగ ఆమెకూ ఒక వ్యక్తిత్వం అవసరం–" స్త్రీకి కూడ శరీరంవుంది ; దానికి వ్యాయామం యివ్వాలి, ఆమెకి మెదడు వుంది ; దానికి జ్ఞానం యివ్వాలి. ఆమెకి హృదయం వుంది ; దానికి అనుభవం యివ్వాలి." అన్న విషయాల్ని గురించి సమాజం కళ్ళు తెరిచేలా, ఆలోచించేలా చేశాడు చలం.

ఫ్యూడల్ వ్యవస్థ దురాచారాల్ని, కులమతాల్ని, మూఢవిశ్వాసాల్ని ఖండించిన చలం ఆధ్యాత్మికత, ఈశ్వరుడూ అంటూ రమణాశ్రమం చేరటం ఆయన ఆలోచనల్లోని వైరుధ్యాన్ని తెలుపుతుంది. దానికి కారణం ఆయన సామాజిక పరిణామాల్ని, వ్యవస్థ స్వభావాల్ని, చారిత్రక, శాస్త్రీయ దృక్పథంతో అవగాహన చేసుకోలేకపోవటం–లేదా చేసుకోటానికి ప్రయత్నించక పోవటం. ఆయన భావాల్లో రచనల్లో ఆఖరికి ఆయన జీవితంలోని వైరుధ్యానికి కారణం భౌతిక వాద దృక్పథం లేకపోవటం. ఆయనది ప్రధానంగా భావుకతత్వం.

మ్యూజింగ్స్‌లో, 'స్త్రీ'లో చలం వ్యక్తంచేసిన అభిప్రాయాలు, ఆలోచనలు కొన్ని సబ్జెక్టివ్‌గా వున్నాయి, కొన్ని పరస్పర విరుద్ధంగాను వున్నాయి, కొన్ని పాక్షికమైన సత్యాలుగా వున్నాయి, కొన్ని విపరీతమైనవి, అవాస్తవికమైనవి మరి కొన్ని అసలు చలం ఆలోచించి చెబుతున్నాడా అన్న సందేహం వేసేవీ వున్నాయి. అయితే చలమే అన్నాడు–తన అభిప్రాయాలు ఆలోచనలు అన్నీ పూర్తి సత్యమని కానీ సరియైనవని కాని అందరికీ పనికివచ్చేవని కాని భావించనవసరంలేదని. ఇదీ మనం గమనించాలి. తన అభిప్రాయాలు నమ్మకాల గురించి విమర్శించుకున్న వాడు స్వయంగా చలం ; పునరాలోచించుకున్న వాడు తప్పు అని గ్రహించినప్పుడు నిజాయితీతో వాటిని మార్చుకోటానికి సందేహించనివాడు. రమణాశ్రమానికిచేరువైన చలం రానురాను సమాజానికి ఎడమైనాడు. ఈనాడు భౌతిక ప్రపంచానికే దూరమైనాడు.

---

## స్థితి

చిల క్కొయ్యకు
వేలాడే
చొక్కాలా
అక్రమమైన

ఆర్థిక వ్యవస్థకు
అవసరం
బానిసై
వేలాడుతోంది.

—రమాకాంత్

కథానిక

# ఆకలి

ఆకలి తట్టి లేపటంతో నీరసంగా కళ్ళు తెరిచాడు సత్యం. తన కాళ్ళ వైపు ఎవరో ఒక వయసు మళ్ళిన వ్యక్తి కూర్చుని వున్నాడు.

సిమెంటు బెంచీ మీద లేచి కూర్చున్నాడు సత్యం- ప్లాట్ ఫారం గీవురు గావురు మంటోంది రకరకాల వస్తువులతో. రావలసిన బండి గంటన్నర లేటని ఎనౌన్సుమెంటు వినబడింది. తను బైల్దేరదామనుకున్న బండి అదే.

ప్రక్కన పెద్దమనిషికి బ్యాగ్ అప్పజెప్పి, ముఖం కడుక్కుని, ఏదో ఒకటి నోట్లో వేసుకుని కడుపు చల్లార్చుకోవాలి అనుకుంటూ బైల్దేరాడు.

మనస్తత్వం ఈ సైడు వాళ్ళలో లేదన్న 'సత్యం' గ్రహించాడు 'సత్యం'.

తనూ అంతే, ఏనాడు పబ్లిగ్గా పదిమంది చూస్తుండగా ఏదీ తిని ఎరగడు. హోటల్లో కూడా ఎవరూ లేని చోట ఒక మూల కూర్చుంటాడు. కానీ తనది 'ప్రెస్టీజ్ కాన్షస్' కాదు!

మొహం కడుక్కుని కర్చీఫుతో తుడుచుకుంటూ 'రైల్వే రెస్టారెంటుకు వెళ్తే' అనుకున్నాడు సత్యం. కమ్మగా ఇంత అన్నం తినొచ్చు. భోజనం చేశామన్న తృప్తి వుంటుంది. - నీ జేబు అతని ఆలోచనని అడ్డుకుంది. ఇంకో నాల్రోజులు ఇలాగే ప్లాట్ ఫారాల మీద గడపాలి.

వి. కె. విశ్వనాథశర్మ

అదొక నార్తిండియన్ స్టేషన్. గరమ్ పూరీ!...గరమ్ పూరీ ... చార్ ఏక్ రుపయా!' తోపుడు బళ్ళ వాళ్ళ కేకలు పోటీలు పడుతూ వినిపిస్తున్నాయి. జౌను ఇక్కడ పూరీని మించిన మంచి తిండి ఇంకోటి దొరకదు. పెద్ద పెద్ద సూటూ బూటూ మనుషులు కూడా బండి ముందు నుంచుని తింటూంటారు. 'అరె! ఇంత ఖరీదైన బట్టలేసుకునాం తగ్గట్టు ఏసీ రెస్టారెంటుకే వెళ్ళాలి. లేకపోతే పదిమందీ నవ్వరూ!' బజార్లో తోపుడుబండి మీద ఏదన్నా కొనుక్కు తినాలని మనసు పీకినా దాన్ని చంపుకునే ఆంధ్రావాడి

నాలుగు పగళ్ళు— నాలుగు రాత్రులు. ఏం జీవితమో! ఏం ఉద్యోగమో! తనిప్పుడు టెంపరరీ డ్యూటీ మీదున్నాడు. వాగన్ ఎస్కార్టు. ఇటువంటి సమయాల్లోనే ఈ మిల్ట్రీ అంటే విరక్తి. అసహ్యం. జేబులో వున్న రెండు పదుల్ని తడువుకొన్నాడు. లాభంలేదు. పూరీయో, ఏదో తిని రోజు వెళ్ళ మారిందనిపించాలి.

తోపుడు బండి దగ్గరకెళ్ళి నాలుగు పూరీ ఇమ్మన్నాడు. ఒక దొన్నెలో పూరీ ఇంకో దాంట్లో బంగాళా దుంప ముక్కలు వేసిన నీళ్ళపులుసు ఇచ్చాడు బండివాడు.

డబ్బులిచ్చి ప్లాట్‌ఫారం చివరగా వచ్చి, చుట్టూ ఎవరూ లేరని నిర్ధారించుకుని పూరీ [illegible] తుంచాడు

ఇంకో ముక్క తిన్నాడో లేదో 'ఢుపుక్' మన్న శబ్దం. దానివెనకే ఇంత వుమ్మి వచ్చి తనుతింటున్న పూరి దొన్నెలో పడింది.

ఉలిక్కి పడి తలతిప్పేడు సత్యం. పరిగెత్తుకు పోతున్న ఓ పదేళ్ళ కుర్రాడు వెనక్కి తిరిగి చూస్తూ చూస్తూ జనంలో కలసిపోయాడు.

సత్యానికి ఆకలి,కోపం ఎక్కువైంది. అయినా ఏం చెయ్యగలడు? ఎవ్వరూ తనని చూడనట్టుంది. పూరీ దొన్నె చూశాడు

వికారం, వెంటనే డోకు గొంతు బద్దలు కొట్టుకువస్తోంది పూరీదొన్నెని ట్రాక్ మీదికి విసిరేశాడు కసిగా డోకు బలవంతాన ఆపుకుని పంపుదగ్గరికి నడిచాడు.

నీళ్ళు పుక్కిలించి వచ్చి నీరసంగా బెంచీ మీద కూలబడ్డాడు. అలాతలెత్తగానే ఎదురుగా ట్రాక్ మీద ఆ కుర్రాడు. తను పారేసిన పూరీని బెదురుగా అటూ ఇటూ చూస్తూ జాగ్రత్తగా ఏరుకుంటూ- ఆకుర్రాడు!-అడుక్కుతినే కుర్రాడు!! ఆకలి కుర్రాడు!!!

## ఓటుకాలం

ఎలక్షన్లొస్తున్నాయి
మతకలహాలు రెచ్చగొట్టండి
కులాలను జాగృతం చెయ్యండి
ఏ సంఘటననూ వృధాపోనీయకండి
గాలికి పోయే పేలపిండివి
ప్రజల కళ్లల్లో చల్లండి.
కాల్పులు సృష్టించి
శవాలను జెండాలుగా వాడుకోండి.
వాగ్దానాల ఎరువులేసి
డబ్బు చెట్లకు
ఓట్లు పూయించండి.
మీ అబద్దాలకు స్పందించే
టెలీప్రింటర్లతో ఊరేగండి
ఈ గొర్రెల తలకాయలు
మరింత వొంచి పట్టండి
కాని
ఎన్నాళ్ళు ఇట్లా ..
గొర్రెలు కొమ్మిసురుతాయి
కూలబడ్డ మీ మీదినుంచి
గిట్టలు నడిచిపోతాయి

—ఎన్. గోపి

# కావ్య సమీక్ష

ఎక్కడో చదివినట్టు గుర్తు – అమెరికాలో గ్రంథ సమీక్షకుల డ్రాయింగ్ రూమ్స్‌లోకి షాంపేన్ నిర్విరామంగా ప్రవహిస్తూంటుందట. ఇది ఒక విధంగా గర్వించదగిన విషయమే అయినా మరోవిధంగా చూస్తే గర్హించదగ్గ విషయం. పుస్తక సమీక్షలకు అంత ప్రాధాన్యత, ప్రాచుర్యం ఉండడం గర్వకారణం; కాని సమీక్షలు షాంపేన్‌తో ప్రభావితాలవడం గర్హనీయం.

మన దేశంలో ఈ సమస్య లేదు. సమీక్ష రచన రచనలలోకెల్లా కనిష్టమైన దని మన నమ్మకం. కనీసం సమీక్షాశరాలు గాఢంగా నాటుకున్న రచయితలు ఈ నిర్ణయానికొస్తూంటారు. సృజనాత్మక శక్తి లేనివారంతా విమర్శకులై పోతా రని ఒక అపప్రథ ఉండనే ఉంది. రాయలేనివాడు రాయగల వాడిలో రంధ్రాల నన్వేషిస్తాడు. 'త్రోయనేర్చు కుక్క దొంతులు పెట్టునా' అన్న వేమన్న వీరికి తోవ చూపాడు

కాని విమర్శకుడూ, సమీక్షకుడూ ఇంత దౌర్భాగ్యులుకారు. చక్కని సమీక్ష రాయడంకూడా అషామాషీ కాదు. అది బాధ్యతాయుతమైన కర్తవ్యం. ఆదర్శ ప్రాయుడైన సమీక్షకుడు నిజాయితీపరుడై ఉండాలి.

సమీక్షించే కావ్యంపట్ల పూర్తి నిజాయితీని ప్రదర్శించాలి. కవినిగాని ప్రచురణ కర్తనుగాని అతడు వ్యక్తిగతంగా తీవ్రంగా ద్వేషిస్తూ ఉంటే ఉండవచ్చు. కాని కావ్యం ప్రశంసార్హమైతే దానిని సోదాహరణంగా, నిష్పక్షపాతంగా ఎత్తి చూపాలి. ఆవిధంగా అతడు పాఠకులకు విశ్వాస పాత్రుడై ఉండాలి. రచయిత తన స్నేహితుడో పరిచితుడో అయినంతమాత్రాన, లేదా ఉభయుల భావాలలో సారూప్యం ఉన్నంతమాత్రాన కావ్యాన్ని ఆకాశానికెత్తెయ్యడం క్షంతవ్యం కాదు. అంటే వీలైనంత ఆబ్జెక్టివ్‌గా ఉండాలి సమీక్ష. అదే సమయంలో సమీక్షకుడు కొనుగోలుదారుల్ని కూడా దృష్టిలో ఉంచుకోవాలి. అమ్మకపు ధరకు తగిన విలువ, ఉపయోగం పుస్తకంలో ఉన్నాయో లేవో అతడు పాఠకులకు చెప్పగలిగి ఉండాలి. దీనికోసం పుస్తకంలోని కొన్ని వాక్యాలను ఉదహరించడం అవసరం.

అయితే ఏ సమీక్షకుడూ పూర్తిగా ఆబ్జెక్టివ్‌గా ఉండలేడు. సమీక్షకుడు హృదయంలేని థర్మామీటరు కాడు – కవిత్వపు విలువల్ని నిర్వికారంగా కొలిచి చెప్పెయ్యడానికి. అతడు సహృదయుడు, పండితుడు, విమర్శ సంప్రదాయాన్ని క్షుణ్ణంగా ఎరిగినవాడూ అయిఉండాలి. అతడికి కొన్ని సిద్ధాంతాలు, నమ్మకాలు, విలువలు ఉంటాయి. ఇష్టాయిష్టాలుంటాయి. తనకి నచ్చని దానిని, తనను

మెప్పించి ఒప్పించలేని దానిని పొగిడి ఆత్మవంచన చేసుకోలేడు కదా! అంటే సమీక్షకుడికి తనపై తనకి విశ్వాసం ఉండాలి. తన 'స్థాయి' మీద తనకి నమ్మకం ఉండాలి. అతడు చేసే సమీక్షలన్నింటిలో అతడి సమీక్షా విధానం, శైలి, వ్యక్తిత్వం ప్రతిబింబితం కావాలి. నిజాయితీ ఎంత అవసరమో నిలకడగా ఉండడం అంత అవసరం.

ఆ తరవాత సమీక్షకుడు పత్రికా సంపాదకుడి విధానాలకు అనువర్తి అయి ఉండాలి. సమీక్ష రాసినందుకు ప్రతిఫలం ఇచ్చేది అతడు. పత్రిక యొక్క సాధారణ స్థాయి, విధానాలు, ఆదర్శాలకు మరీ దూరంగా పోవడం భావ్యం కాదు సమీక్షకోసం ఇవ్వబడిన కాలం (గడువు), కాలం (స్థలం) విషయంలో కూడా సంపాదకులని మరీ ఇబ్బంది పెట్టకూడదు. సమీక్షకి స్థితిస్థాపకత (elasticity) ఉండాలి. అవసరమయితే సైజు మార్పుకి అనువుగా. ఈ విషయం, సంపాదకుడికి సమీక్షకుడిపై గల నమ్మకంపై ఆధారపడి ఉంటుంది.

సమీక్షకుడు పాఠకుల విషయంలో జాగ్రత్తగా ఉండాలి. కావ్యంలోని బాగోగులని తులనాత్మకంగా పరిశీలించడమే అతడికర్తవ్యంగాని పాఠకులకి సలహాలివ్వడం కాదు. నీతులు చెప్పడం, పాపగాండా మానుకోవాలి. ప్రజలని తన దిశలో బ్రెయిన్‌వాష్ చెయ్యడం కాక, అవసర సమయాల్లో మంచిచెడుల తారతమ్యాల్ని విప్పి చెప్పి వారి నైతిక విలువల్ని, సాహితీ స్థాయినీ పెంచే ప్రయత్నం చేయవచ్చు.

సమీక్ష ఒక చక్కని రచన అయి ఉండాలి. కావ్యం గురించిన సమాచారాన్ని పొడిగా, అనాసక్తంగా అందించడం కాకుండా, కావ్యపఠనంలో ప్రజలు అనురక్తులయేటట్టు మళ్ళించాలి. ఇది సమీక్షకుడికి రచయితపట్ల, సంపాదకుని పట్ల గల కనీస బాధ్యత పత్రిక స్థాయిని నిర్ణయించే అంశాల్లో పుస్తక సమీక్ష కూడా ఒకటి. సమీక్షా రచనకూడా సృజనాత్మక కళే. ప్రతీ సమీక్షా విషయ బోధకమూ, ఆహ్లాదకరమూ కూడా అయిఉండాలి.

ఈ లక్షణాలన్నిటినీ పుణికి పుచ్చుకున్న సమీక్షలు తెలుగుకావ్యాలకు లభిస్తున్నాయా అని విచారిస్తే ఫలితం చాలా నిరుత్సాహకరం. నూటికి నూరుపాళ్ళు ఆదర్శప్రాయుడైన సమీక్షకుడు కావాలనుకోవడం దురాశే కావచ్చు: కాని సమీక్షకులంతా ఆ దిశగా పెరగడం అవశ్యం వాంఛనీయం.

—కె. గోదావరిశర్మ

# ప్రగతిశీల పరిశీలన

జూలై 79 "అభ్యుదయ" లోని వసంతరావు దేశపాండేగారి వ్యాసం "రచ్చల్లో వెతకాల్సిన రత్నాలు" మీద అగస్టు సంచికలో "ప్రగతిశీల పరిశీలన" పేరిట శ్రీ దాశరథి రంగాచార్యు లవిమర్శ మలేరియా రోగికి టైఫాయిడ్ మందులా వుంది.

రంగాచార్య వంటి ఉత్తమ రచయితలూ అభిజ్ఞులు, యువతరపు రచయిత లకూ, విమర్శకులకూ సలహా లివ్వడం సాహిత్యానికి ఆరోగ్య ప్రదమే. అయితే, దేశపాండేగారి వ్యాసానికీ, రంగాచార్యులగారి విమర్శకూ పొంతనే కనిపించడం లేదు. వ్యాసంలో వారు బాధపడాల్సిన అంశం ఏంవుందో నాకైతే బోధ పడలేదు.

"కథల్లో రాశి పెరిగినంతగా వాసి పెరగడం లేద"నే దేశపాండేగారు బాధ పడ్డారు గానీ అసలు మంచి కథలు రావడమే లేదనలేదే! అందుకు వ్యాస శీర్షికలోని నిర్ద్వంద మైన ధ్వనే తిరుగులేని రుజువుకదా! అరిగిపోయిన రికార్డుల్లాంటి భావాలూ - వాక్యాలూ గాక, విషయంలోనూ వివరణా విధానంలోనూ నూతన త్వమూ, ప్రత్యేకతా వుండాలనేదే వ్యాసంలోని వాదం. అది రచయితలకు ఆచర ణీయమైన సలహా కాదా? అంత మాత్రాన "కథారచయిత" లందర్నీ "నరకడానికిం కేమీ మిగల్లే"దనడం నాకైతే ఎబ్బెట్టుగా అనిపిస్తున్నది.

**చర్చావేదిక**

రచయితలూ, పత్రికలూ పెరగడంముదావహమే. అవి పెరిగినందుకు దేశపాండే గారు "ఏడ్చిన" లక్షణాలు వ్యాసంలో కనిపించలేదు. కాకుంటే రచయితలూ - పత్రికలూ "వాసి"కి ప్రాధా న్యం ఇస్తున్నట్లు లేదన్న ఏడుపు (ఆచార్యుల వారి భాషలో) కొంత వుంది. మరి మూలంలో లేని విషయాన్ని ఉన్నట్లుగా భావించి ఏడవడమే "ప్రగతిశీల విమర్శ నమా"! ఒకవేళ అదే "ప్రగతిశీలత" అయితే, అభ్యుదయ పాఠకులుగా అదిమా కవసరం లేదు.

"సాహిత్యాన్ని తరచి మంచి వానిని ఎత్తిచూపడం అవసర" మన్న రంగా చార్య సలహా విమర్శకులందరికి శిరోధార్యమే. అందుకు సంతోషం. కాని గీటు రాళ్ళవంటి కొందరు రచయితల్ని ఉదహరించడం, "వీరు తప్ప మరో మంచి రచ యితే లేడు" అనడమెలా అవుతుందో అర్థంకాదు.

నాకొక్క సందేహం - అసలు ఆచార్యులవారు వ్యాసం పూర్తిగా చదివారో లేదోనని!

ఏది ఏమైనా పెద్దలు కుర్రకారును విమర్శించేటప్పుడు నిర్లక్ష్యంగా హాస్యాస్పదంగా గాక (కుర్రకారులోనూ పసవున్న వాళ్లు లేకపోలేదన్నది వారంగీకరించిన సత్యమే గదా!) కొంచెం బాధ్యతా యుతంగానూ. సహృదయంతోనూ, యువకులకు మార్గదర్శకంగానూ వ్యవహరిస్తే బాగుంటుందనుకుంటాను. పదాల విషయంలోనూ కొంచెం జాగ్రత్త అవసరమేమో.

-సురభి మనోహరరావు

## కాస్త చిత్తగించండి

1. సెప్టెంబరు అభ్యుదయలో అవంతిగారి వ్యాసం చదివి కాస్త విస్తుపోయాను.

"ఏ విషయాన్నైనా బోధించాలనుకుంటే వ్యాసం రాస్తే సరిపడుతుంది కదా?" అని చెప్పేవాళ్ళంతా ఆయన దృష్టిలో రచనకు సామాజిక ప్రయోజనం అక్కర్లేదనే వాళ్ళే.

రచన లేక కళయొక్క ప్రధాన లక్ష్యం హృదయానికి నరిష్మెంట్ ఇవ్వడమే. అయితే దాని అర్థం హృదయానికి నరిష్మెంట్ ఇవ్వడం అంటే ఆలోచన స్థాయిలో విద్యావంతులను చేయరాదని అర్థం కాదు. కళలకు సంబంధించి హృదయం, మెదడు అన్నవి పరస్పర విరుద్ధాలని ఎందుకనుకోవాలి మనం? కళలను సృష్టించేప్పుడుకానీ, వాటిని ఆనందిస్తున్నప్పుడుకానీ హృదయం మెదడు రెండూ పని చేస్తుంటాయి. అయితే కళల యొక్క ప్రధాన లక్ష్యం హృదయాన్ని కదిలించడమే. హృదయాన్ని కదిలించే ప్రక్రియలో అనివార్యంగా మెదడును చైతన్యవంతం చేయొచ్చు. కళ యొక్క లక్ష్యం అనుభూతుల (feelings) ను reorganise చేయడమే అంటాడు క్రిష్టాఫర్ కాడ్వెల్.

2. 'బోధక స్వభావమైన వ్యక్తీకరణంలేకపోతే రచన పూర్తికాదు' అంటున్నారు అవంతిగారు. రచనలో వ్యక్తీకరణం అన్నది తప్పనిసరిగా కళాత్మకంగా వుండాలే తప్ప బోధకంగా ఎందుకుండాలో నా కర్థంకావడంలేదు.

పాఠకుడు ముందుతాను చదువుతున్న రచనలోని పాత్రల రాగ ద్వేషాలతో తాదాత్మ్యం చెందుతాడు. ఆ తర్వాత అందులో యేమైనా బోధనాత్మక విలువలుంటే, అవి స్వీకరిస్తాడు.

అందుకని కళల్లో ప్రాధాన్యం అనుభూతిదే ; ఆలోచనది ద్వితీయస్థానమే. పాఠకులకు బోధించడానికి రచయితలే అవసరంలేదు; ప్రచారకులు చాలుకదా!

కాకపోతే ప్రతి కళలోనూ కొంతబోధన స్వభావం వుండే వుండొచ్చు. అంతమాత్రాన కళాకారునిలో బోధకునిదేపైచేయి అనడం అన్యాయం. ప్రతికళాకారుడూ ప్రధానంగా హృదయవాదిగా వుండాలి. అంటే కళల్లో బుద్ధివాదానిది రెండవ స్థానమే. గొప్పకళ ఎప్పుడూ అటుహృదయానికీ ఇటు మెదడుకూరెంటికీ నరిష్మెంట్ యిస్తుందంటారు పెద్దలు.

—యశస్వార్

# అసహ్యమైన అనాగరిక దృశ్యం

అందంగానే వుంటుంది
కడుపునిండితే కమ్మగా కబుర్లు దొర్లిస్తూ
హాయలు వొలికిస్తూ చూపులు పోగేస్తూ
ఎగిరే వాసనల్ని, మెదిలే రుచుల్ని
మనసుతోనే ఆఘ్రాణిస్తూ
పిటపిటలాడే ప్లేట్లల్లోంచి
నాజుగ్గా ఒకటో. అరో అందుకుని
అంటీ అంటనట్టు పావోపరకో కొరికి
క్షణాల్ని నిమిషాల్ని సాగదీసుకుంటూ
తినడం కూడా ఒక కళగా ప్రచారంచేసే
వాళ్ళని
చూడ్డానికి అందంగానే ఉంటుంది.
నిజమే అసహ్యంగానే వుంటుంది
కడుపులో ఆకలి
పేగుల్ని మెలేస్తున్నప్పుడు
నోరిప్పితే గాలే దూరిపోతుందన్న
భయంతో
అడ్డంగా అన్నంముద్దే దూర్చి
దాని రుచీ వాసనల్ని పట్టించుకో
కుండానే
అమాంతం మింగేసి
పలబారి, అందరి దృష్టిలోపడి
క్షణంకూడా ఆలస్యం చెయ్యక,
చేస్తే అన్నంముద్దల్ని అందుకోడానికి
ఆకలిపేగులే నోటివరకు సాగివచ్చేస్తా
యని
భయం భయంగా
చుట్టూవున్న వాళ్ళ చూపుల్ని మాటల్ని
చివరికి వాళ్ళ ఉనికిని సైతం మర్చి
అన్నం తప్ప మరోటి తెలీనట్టు
ఆబగా, ఆర్తిగా, అన్నం తినేవాళ్ళన్ని
చూడ్డానికి అసహ్యంగానే వుంటుంది
నిజమే ఒప్పుకుందాం.
మరి డబ్బు ఆకలి మాటేమిటి?
దానికోసం
తన చుట్టూవున్న వాళ్ళనే మర్చిపోయి
అదే జీవిత పరమార్థంగా
సిగ్గూ ఎగ్గూ విడిచి, న్యాయం ధర్మం
మరిచి
దొడ్డి దారుల్లోనూ, అడ్డదారుల్లోనూ
ఆబతో, ఆరాటంతో,
డబ్బుకూడేసేవాళ్ళను
చూడ్డానికి మరీ,
అసహ్యంగానే కాదు
అనాగరికంగానూ వుంటుంది.

—శీలా వీర్రాజు

# తెలుగులో నిఘంటు నిర్మాణం

భారత భాషల్లో సాంప్రదాయక నిఘంటువులు పద్యరూపంలోనో, శ్లోకరూపంలోనో కంఠస్థం చెయ్యడానికిఅనువుగా వుండేవి. సంస్కృతంలో అమరకోశం, తెలుగులో ఆంధ్రనామ సంగ్రహం యిలాటివి. కావ్యవ్యాకరణ–అలంకార శాస్త్రాలు నేర్పకముందు చిన్నతనంలోనే ఈకోశాలను వల్లవేయించేవారు. తెలుగులో అకారాది క్రమంలో పట్టికా రూపంలో శబ్దాలను అర్థాలను కూర్చి అవసరం వచ్చినప్పుడే ఉపయోగించుకొనే రిఫరెన్స్ గ్రంథంగ కోశం తయారుచేసే ప్రయత్నం ఆంగ్లభాషా సంపర్కం ఏర్పడ్డ తరవాతనే జరిగింది.

నిఘంటు నిర్మాత ప్రతిభా వ్యుత్పత్తులను బట్టి, ఏర్పరచుకొన్న నిర్మాణ లక్ష్యాలను బట్టి నిఘంటువులను కొన్ని తెగలుగా విభజించవచ్చు. స్వభాషా కోశాలు,ద్విభాషాకోశాలు బహుభాషాకోశాలు‖అనేది ఒకరకమైన. విభజన సమకాలీన భాషా కోశాలు, చారిత్రక సూత్రాలపై రాసిన కోశాలు అనేది మరో రకమయిన విభజన శబ్దరత్నాకరం, సూర్యరాయాంధ్ర నిఘంటువు, ఆంధ్ర వాచస్పత్యం మొదలైనవి సాహిత్య భాషను అధునిక భాషను ఒకే తాటను గట్టి రాసిన కోశాలు, వీటిని సింక్రోనిక్ డిక్షనరీస్ అంటారు. చారిత్రక సూత్రాలపై శబ్దార్థ నిర్ణయం చేస్తూ రాసిన కోశం – అంటే డయాక్రోనిక్ డిక్షనరీ – ఇంకా తెలుగులో వెలువడ లేదు అలాటి కోశంలో ప్రతి శబ్దాన్ని మొదటి నుంచీ ఇప్పటివరకూ ఏయే అర్థ విశేషాల్లో ప్రయోగించారో సమగ్రంగా యివ్వాలి. ఆ ప్రయోగాల మూలంగా ఒక శబ్దానికి రూపంలోనూ, అర్థంలోనూ కాలాంతరంలో వచ్చిన పరిణామాలు ప్రదర్శించాలి పూనా డెక్కన్ కాలేజ్ వారు ఈ మధ్య వెలువరిస్తున్న సంస్కృతాంగ్ల కోశం ఈ తెగకు చెందింది.

తులనాత్మక దృష్టితో రాసినవి వ్యుత్పత్తి కోశాలు. ప్రతి మాటను సోదర భాషా శబ్దాలతో పోల్చి, మూలధాతువును గుర్తించి, ఆ మాట పుట్టుపూర్వోత్తరాల నివ్వటం ఈ కోశ లక్ష్యం. తెలుగులో యిటువంటి ప్రయత్నం ఆంధ్ర విశ్వ విద్యాలయంలో 1956లో శ్రీ గంటిజోగి సోమయాజులుగారి పర్యవేక్షణలో మొదలైంది. ఆ తర్వాత అచ్చుల కోశమంతా ఆచార్య యాకాటి దోణప్పగారి పర్యవేక్షణలో తయారైంది. ఇవిగాక ప్రత్యేక ప్రయోజనాల కోసం ఏర్పడ్డవి మాండలిక వృత్తిపద కోశాలూ, శాసనపద కోశాలూ, గ్రామనామ కోశాలూ, కావ్యపద ప్రయోగ కోశాలు (కాన్‌కార్డెన్సెస్, మొదలయినవి. అన్నిరకాల లక్ష్యాలనూ తానేర్పరుస్తూ ఈ కోశాల ప్రయోజన సర్వస్వాన్ని సమన్వయిస్తూ, బృహ

—శ్రీ భద్రిరాజు కృష్ణమూర్తి.

శోకాలు నిర్మించవచ్చు. ది ఆక్స్‌ఫర్డ్ ఇంగ్లీష్ డిక్షనరీ ఇలాంటిదే. బృహత్కోశ నిర్మాణానికి చాలామంది పండితుల నిరంతర కృషి, పుష్కలమయిన ద్రవ్య సహాయం కావాలి, అప్పటికైనా అలాంటి కోశ నిర్మాణం యాభైయేళ్ళకు పైచిలుకు పడుతుంది. అలాంటి కోశంలో ఆరోపంగా యిచ్చిన ప్రతి శబ్దానికి ప్రమాణ భాషలో ఉచ్చారణా, దాని భాషాభాగం, వ్యుత్పత్తీ, చారిత్రక దృష్టితో మొదటి నుంచీ వున్న ప్రయోగాలూ, ఆరోపం మాండలిక పదమయితే ఏ మండలంలో దాన్ని వ్యవహరించేదీ, యితర మండలాల్లో దానికి సమానార్థంలో ఉన్న రూపాలూ, అవసరమయితే అర్థవివరణకు సహకారిగా ఒక బొమ్మా మొదలైనవి యివ్వాలి. ఇలాంటి కోశాలు యితర భాషా వ్యవహర్తలకు కూడా ఉపయోగపడేట్టు ఆరోపాలను తెలుగుతో పాటు రోమన్ లిపిలో కూడా యిస్తూ సంగ్రహమయిన అర్థవివరణ హిందీ, ఇంగ్లీషు భాషల్లో కూడ యిస్తే బాగుంటుంది. ఇంత పెద్ద పెట్టు ప్రయత్నం సంస్థలకే గాని, వ్యక్తులకు సాధ్యం కాదు.

కోశ నిర్మాణంలో అన్నిటికన్న కష్టమయింది అర్థనిరూపణ. అతివ్యాప్తి-అవ్యాప్తులు లేకుండా మాటలకు నిక్కచ్చిగా అర్థాలు చెప్పటం కత్తి మీద సాము లాంటిది. ఏ మాటకు అర్థం చెపున్నామో ఆమాట, దాని అర్థంలో రాకూడదు. అంటే పిల్లికి అర్థం పిల్లి అని రాయకూడదు మాతృభాషా కోశాల్లో సులభమయిన మాటలకు క్లిష్టమయిన మాటలు అర్థాలుగా యివ్వగూడదు. శబ్దరత్నాకరకారుడు 'పిల్లి'కి అర్థం 'మార్జాలం' అని యిచ్చాడు. యిది చివరికో సామెతగా మారింది. తెలుగు నేర్చుకునే సంస్కృత పండితుణ్ణి ఉద్దేశించిన తెలుగు - సంస్కృత నిఘంటువులో పిల్లికి మార్జాలమనే అర్థం యివ్వవచ్చు అలాగే సంస్కృతం నేర్చుకునే తెలుగు వాళ్ళ కోసం ఉద్దేశించిన సంస్కృతాంధ్ర నిఘంటువులో 'మార్జాలం' అనే ఆరోపానికి 'పిల్లి' అనే అర్థం యివ్వవచ్చు. కాని తెలుగు - తెలుగు నిఘంటువులో యిది ఉచితమయిన అర్థ నిరూపణ పద్ధతికాదు. అమెరికన్ కాలేజ్ డిక్షనరీలో 'క్యాట్' అనే మాటకిచ్చిన అర్థం చూడండి...'ఏ స్మాల్, లిటిల్, సాఫ్ట్‌ఫర్డ్ ఏనిమల్ డొమెస్టికేటెడ్ సిన్స్ ఏన్షియెంట్ టైమ్స్ అండ్ ఆఫెన్ కెప్ట్ యాజ్ ఎ పెట్ ఆర్ ఫర్ కిల్లింగ్ మైస్.' మాండలిక వృత్తిపదకోశాల్లో ఈ రకమయిన వివరణాత్మక విధానాన్నే అనుసరించాం. ఉదాహరణకు 'ఆకు' అనే మాటకు వ్యవసాయ పద కోశంలో యిచ్చిన అర్థం 'పైరు పెరుగుదలలో ఒకదశ, మొక్క తలెత్తిన తర్వాత విస్తరిల్లే పచ్చటి భాగం. ప్రామాణిక నిఘంటువుల్లో 'ఇది ఒక వృక్ష విశేషం, ఇది ఒక జంతువిశేషం' లాంటి అర్థాలు యివ్వగూడదు. ఒక పదానికి అనేక అర్థాలు ఉంటే వాటిని ఏ క్రమంలో యివ్వాలనేది మరో సమస్య. చారిత్రకంగా ప్రాచీనమయిన అర్థాన్ని మొదట యిచ్చి, అర్వాచీనమయిన అర్థాన్ని తర్వాత యివ్వాలి. ఉదాహరణకు 'కాలు' అంటే 'జంతువు' నిలబడటానికి, నడ

వటానికి ఆధారమయిన శరీరావయవం 'అనేది ప్రాథమికార్థం. అర్థ విపరిణామం వల్ల 'కుర్చీకాలు' ముక్కాలుపీట' మొదలైన వాటిల్లో కాలు అనే పదానికున్నఅర్థం, రెండవ తరహాలో వచ్చింది. ఒక శబ్దం ప్రయోగించే సందర్భాలన్నీ దొరికినప్పుడే దాని అర్థ వివరణలో సమగ్రత ఏర్పడుతుంది తిక్కనగారు వాడిన 'కట్టుపకాసులు ఈరువు మొదలైన పదాలకు ఎక్కువ ప్రయోగాలు లేకపోవటంవల్ల అర్థ నిరూపణ సాధ్యం కాలేదు.

ఒక శబ్దానికి చారిత్రకంగా సమన్వయించదగిన అనేకార్థాలు ఉన్నట్టే, సర్వాన్వయించటానికి వీలులేని అర్థాలున్నా, ఉచ్చారణ ఒకేరకంగా ఉండేపదాలు కూడ ఉండవచ్చు. ఉదా: 'వాడు' అనే క్రియను 'వాడి పోవటం' అనే అకర్మక క్రియగాను 'ఉపయోగించటం' అనే సకర్మక క్రియగా వాడుతుంటాం. కాని ఈ రెంటడాలకు పరిణామరూపమయిన సంబంధంలేదు. యివి రెండూ వేరు వేరు శబ్దాలు యాదృచ్ఛికంగా వాటి ఉచ్చారణలో ఏకరూపత ఏర్పడ్డది. ఈ రెండూగాక సర్వనామంగా 'అతను' అనే అర్థంలో వచ్చే 'వాడు' మరోశబ్దం. ఇలాటి శబ్దాలను కోశంలో యిచ్చేటప్పుడు మూడుఆరోపాలుగా విడగొట్టి,'వాడు,' 'వాడు,' 'వాడు,' అని యివ్వాలి.

ఈ రకమయిన విభజనకు కోశకారుడికి విస్తృతమయిన భాషాపాండిత్యమే గాక, వ్యాకరణజ్ఞానం, సోదరభాషలతో పరిచయం, కోశరచనా విధానం యివన్నీ క్షుణ్ణంగా తెలిసివుండాలి.

భారతీయ భాషల్లో ద్వితీయ స్థానం ఆక్రమించే తెలుగులో బృహత్కోశం తయారుచేసే ప్రయత్నం ఎప్పుడో మొదలు కావలసింది. ఇప్పటికన్నా మొదలుపెట్టటం అవసరం.

[ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుండి ప్రసారితం.]

---

# తమాషా

హిందీమూలం; అనువాదం :

## భారత్ భూషన్ పుట్టపర్తి రాజు అశ్వత్థనారాయణ

ఎన్నిసార్లు దండోరా వేసినా
ఎన్ని కరపత్రాలు పంచినా
తలకూ బండరాతికీ జరిగే పోరాటాన్ని
చూసేందుకు రారెవ్వరూ.
ఫలితం అందరికీ తెలిసిందే కనుక
తల పగిలి ముక్కలయ్యే త వరకూ
నీవు ఒంటరిగా పోరాడుతూ వున్నా

అందరూ దీన్నొక తమాషా అను
కొంటారు
తర్వాతేముంది?
బహుశా వారు పూలమాలలు తేవచ్చు
కాకుంటే
నీ శవాన్ని తమ భుజాలపై
మోసుకెళ్ళనూవచ్చు.

# కొత్తగాలి

కథానిక

శ్రీ మధుర్‌జీ

సరిగ్గా సంవత్సరం క్రితం.

ఆరోజు కూడా ఆగష్టు పదిహేనే –

ఎలిమెంటరీ స్కూళ్ళపిల్లలతో నాలుగు జెండాపాటలు పాడించి–పప్పులు, బొరుగుల సంతర్పణ జరిపేరోజు

అధికారులు, అనధికారులు, నాయకులు మంత్రులు మహాశయులుముక్తకంఠంతో అమాయకులను ఉపన్యాసాల వెల్లువల్లో ముంచి, వాగ్దానాల మత్తులో తేలియాడించేరోజు.

అవును. అది ఆగష్టు పదిహేనే

ఉదయం ఆరుగంటలకింకా అయిదు నిమిషాలు తక్కువగానే వుంది.

పోలీసు రామయ్య గేటు మీద చెయ్యి వెయ్యగానే సీమకుక్క 'గయ్'మంటూ విరుచుక పడింది. పోలీసురామయ్యను రోజు చూస్తున్నా –చూసిన ప్రతిసారి ఆ సీమకుక్క అలా 'గయ్' మంటూ రామయ్య మీద దూకుతునే వుంటుంది 'అయ్యో! ఇదేమిటి ఈ కుక్కకు కూడా లోకువై పోతున్నానే'–అంటూ రామయ్య మనసులోనే అనుకుంటూ వుంటాడు.

ఆ కుక్క ఆయింటి తాలూకు యజమానిది.

ఆ యజమాని పోలీసురామయ్య పని చేస్తున్న స్టేషన్–సర్కిల్ ఇన్‌స్పెక్టరు, ఆరడుగుల ఎత్తు– ఎనభై కేజీలబరువు వున్న ఆ సర్కిల్ కళ్లలో బక్క జీవుల పైన అకారణమైన ఆగ్రహము నిర్లక్ష్యము తప్ప మరేమీ వుండవు. ఆయన ముందు నుంచున్నంత సేపు పోలీసులు ఊపిరి కూడా సరిగా పీల్చుకోరన్నా అతిశయోక్తి కాదు. పై ఆఫీసర్లు వచ్చినప్పుడు వారిపట్ల సర్కిల్ కనబరుస్తున్న భక్తిప్రపత్తులు చూచి పోలీసులు ఆశ్చర్య పోతుంటారు. ఇక నాయకులో వినాయకులో వస్తే చెప్పనక్కరలేదు.

'ఎవరూ'?–లోపలనుండి అమ్మగారి గొంతు మనిషిపైకి ఎంత అందంగా కన్పిస్తుందో –మనసులో అంత రాక్షసి. ఎప్పుడో ఓ పోలీసు మల్లెపూలు తేవటం కాస్త ఆలస్యమయిందని అతన్ని సీమ కుక్క చేత కసిదీరా కరిపించింది కుక్కను ఒళ్లోకూర్చోబెట్టుకొని మనుషుల్ని పురుగులకన్నా హీనంగా చూస్తుంది

'నేనండి అమ్మగారు ! రామయ్యని' –గొంతు నిండా వినయం.

'ఓహ్! ఇప్పుడా రావటం –అప్పుడే సిక్స్'గట్టిగా విసుక్కుంటోంది బెడ్‌రూములో నుంచే అయ్యగారు ఎక్కడలేస్తారోనని రామయ్య గుండె గొంతులో కొట్టుకుంటోంది.....

'చూడూ! ఇవాళ ఇండిపెండెన్సుడే కదా! నాకూఅయ్యగారికీ బోలెడన్ని యెంగేజిమెంట్సున్నాయి. బాత్‌రూములో నీళ్లు పడేసి–మార్కెట్‌కెళ్లి కూరగాయలు తెచ్చి వంటమనిషి కిచ్చి–బాబును త్వరగా

రడీ చేసి స్కూలు దగ్గర విడిచిరా!...
ఆమె అలా చెప్తూక టూనే పోతుంది. సడన్‌గా ఆపి-కిటికీలో నుండిరా మయ్యను పురుగును చూచినట్లు అసహ్యంగా చూస్తూ ఏం! అలా నుంచున్నావ్ కొయ్యబొమ్మలా. ఛీ! డర్టీ ఫూల్! కొంచం కూడ యాక్టివ్‌నెస్‌లేదు- అంటూ అవులించింది.

రామయ్య తలవంచుకొని బిడెతీసుక వెళ్ళాడు. ఉదయం వాతావరణంలో గాలి మౌనంగా వుంది. ఆకులు కూడ కదలటానికి భయపడుతున్నాయి. పోలీసు రామయ్య మనసులాగే వాతావరణం కూడ నిర్వేదంగా వుంది.

పని....పని....పని

గడియారం ఎనిమిది గంటలు కొట్టేదాక రామయ్య యంత్రం లాగ అటూ యిటూ పరుగెత్తుతునే వున్నాడు.

అయ్యగారి మోటర్ బైక్ గర్వంగా వెళ్ళిపోయింది.

చిన్నబాబునీట్‌గా తయారై వచ్చాడు.

ముచ్చటగా, ముద్దుగా,ముట్టుకుంటేనే కందిపోయేలా - ఖరీదుగా, హుషారుగా వున్నాడు

పోలీసు రామయ్యను వేలితో చూపిస్తూ ఆరేళ్ళ అందాల చినబాబు మమ్మీ చెవులో రహస్యంగా ఏమో చెప్పాడు.

అంతే! మమ్మీ, చినబాబు పగలబడి నవ్వారు.

యాభై ఏళ్ళ రామయ్య తల వంచుకు నిలబడ్డాడు.

'బాబును రిక్షాలో జాగ్రత్తగా తీసికెళ్ళు' - ఆర్డర్

'అలాగే నండమ్మగారు'-వినయం.
రామయ్య, చినబాబు వెళ్ళిపోయారు.

చినబాబును చూస్తుంటే పోలీసురామయ్యకు సూరిగాడు మదిలో మెదిలాడు.

సూరిగాడు - సూర్యం - రామయ్య ఆఖరి కొడుకు.

పదమూడేళ్ళ వయసున్నా పదేళ్ళ అర్భకుని లాగానే వుంటాడు.

కళ్ళల్లో దైన్యంతప్ప ఉత్సాహం వుండదు. చిరిగిన బట్టలతో చింపిరి తలతో ఏదో పోగొట్టుకున్నట్లుంటాడు. ఇవ్వాల్టి స్వాతంత్ర్య దినోత్సవానికి మాష్టారు తెల్లచొక్కా- చిరుగులు లేనిది తొడుక్కురమ్మన్నాడని-దానికోసం నిన్న సాయింత్రం నుండి ఏడుస్తూనే వున్నాడు. తల్లి మాత్రం ఏం చేస్తుంది-తన అసహనాన్ని పిల్లవాడి వీపుమీద ప్రదర్శించటంతప్ప.

ఇంట్లో పొయ్యి మీదకు, పొయ్యి కిందకు ఏమీ లేవని ఇల్లాలు ఆరోపణ.

వానకు ఎండకు కూడ రక్షణ యివ్వలేని వరండాలో కుక్కి మంచంలో రామయ్య ముసలి తల్లి- మందులులేవన్న ఫిర్యాదు-

పురటికి వచ్చిన పెద్ద ఆడకూతురు-

కాలేజి ఫీజులకు భయపడి ఆ చదువుకి దూరమై-ఏడవ తరగతి చదువుతోనే వుద్యోగాల వేటలో పడక తప్పని పెద్ద పిల్లవానికి యింటర్వ్యూల ఖర్చులు.,

ఇంట్లో కాలుపెడితే జోరీగల్లా చుట్టుముట్టే సమస్యలు....

ఈ సమస్యలన్నిటికీ కావలసింది ఒక్కటే.

పోలీసు రామయ్య లాటి వ్యక్తుల దగ్గర కూడ లేనిది ఒక్కటే.

డబ్బు .. డబ్బు .. .డబ్బు చిన బాబును పాలరాతి భవనం లాటి కాన్వెంటుముందు జాగ్రత్తగా దింపాడు — కన్న కొడుకులను కూడా ఎన్నడూ బడిదగ్గర దిగబెట్టటానికి తీరిక లేని పోలీసు రామయ్య.

స్కూలు గడియారం తొమ్మిం కొట్టింది.

రామయ్య గుండెలు భయంతో కొట్టుకున్నాయి.

తొమ్మిదిన్నరకు గ్రౌండ్స్‌లో 'మాస్ పేరేడ్' వుంది.

డి.యస్.పి.. గారు పర్యవేక్షిస్తారు. సర్కిల్ మనుష్యుల్ని (సాదా) పురుగుల్లాగా చూస్తే, డియస్‌పిగారు ఈ అలగా నాయాల్ని బూట్ క్రింద వేసి రాయాలంటాడు' మరో మెట్టుపై నున్నాడు కదామరి !

రామయ్య పరుగులాటి నడకతో రెండు కిలోమీటర్ల దూరమున్న పోలీసు క్వార్టర్స్ అనబడే గూటినిచేరి-జీవితంలో మొదటిసారిగా ఈ వుద్యోగంలో చేరినపుడు -భవిష్యత్తును బంగారంగా వూహించుకుంటూతొడుక్కున్న యూనిఫారం —యాంత్రికంగా వేసుకొని గ్రౌండ్‌కు పరుగుతీశాడు పెరేడ్‌కు.

అప్పటికే పెరేడు జరుగుతోంది.

రామయ్య గుండెలు భయంతో గుబగుబలాడాయి. డియస్‌పి - వేషంతో వున్న పులిలావుంటే, ప్రక్కనున్న సర్కిల్ చిన్నతోడేలులా వున్నాడు

'అరే బేవ్‌కూఫ్ ఇలారా'-డియస్‌పి గర్జించాడు. రామయ్య కాళ్లు, చేతులు వణుకుతున్నాయి. వినయంగా, అత్యంత దీనంగా "సెల్యూట్ చేసి నుంచున్నాడు.

'ఏరా గాడిదకొడకా। యిండిపె డెన్స్‌డే పెరేడ్‌కు లేట్‌గావస్తావురా రాస్కెల్. కడుపుకు ఏంతిన్నావురా? కుక్కా ఇంట్లో పెళ్ళానికి కల్లు పిసుకుతున్నావురా 'ఈ లక్ష్మీ కొడుకుల్ని బూట్‌తో తన్ని చెప్పాల ...'

సర్కిల్ గంభీరంగా వున్నాడు

మిగతాపోలీసులు మౌనంగావున్నారు. వారూ యిలాంటి "సన్మానాలు" ఎన్నో చేయించుకోక తప్పింది కాదు.

'ఇంతదాక నీ ప్రక్కన గంభీరంగా నుంచున్నాడే - అ గాడిద యింటో గాడిద చాకిరి చేసివచ్చానురా' - ఈ జవాబు రామయ్య గుండెల్లోనే ఖూనీ చెయబడింది.

'పోరా లక్ష్మీ కొడుకా - గన్ ఎత్తుకొని ఈ గ్రౌండ్‌లో ఫోర్‌రౌండ్స్ కొట్టు' - డియస్‌పి గర్జించాడు.

పోలీసు రామయ్య తుపాకి ఎత్తుకొని పరుగెత్తాడు.

x x x x

మళ్లీ ఆగష్టు పదిహేను.

సర్కిల్ యింటో విందులేస్తున్నాడు. ఆరుదాటి ఏడైనా ఏ పోలీసు చాకిరికి రాలేదు. ఇంటో నీళ్ళులేవు. కూరగాయలు లేవు. అమ్మగారు చికాకు పడుతున్నారు. పెళ్ళాంముందు తన పరువు పోతున్నందుకు సర్కిల్‌కు తల కొట్టేసినట్లుగా వుంది, చినబాబు. కాన్వెంట్‌కు పోవాలని తొందర పడేకొద్దీ అమ్మగారికి చికాకు పెరిగిపోతుంది.

సర్కిల్‌గారు కోపంగా స్టేషను చేరుకున్నాడు. ఎవ్వరూ వంగి వంగి

దండాలు పెట్టలేదు-యాంత్రికంగా విష్ చేయడం తప్ప పెరేడ్ తర్వాత డిన్నరుంది. డిన్నరు అరేంజ్ మెంట్లు-ఒక్కొక్కటి ఒక్కో పోలీసుకు అప్పగించాడు. అయినా ఎవ్వరూ ఆ డిన్నరుగురించి పట్టించుకోలేదు

సర్కిల్ కు తలతిసినట్లుగా వుంది

డియస్పి వచ్చాడు. పెరేడ్ జరిగింది కాని ఆ నవాయితీగా జరుగుతున్న డిన్నర్ లేదు. సర్కిల్ దీనంగా జరుగుతున్నది చెప్పాడు. గుండెల్లోని గుబులు కనపడనీయకుండా డియస్పి - రామయ్యను, మరోయిద్దరి వెంటనే సస్పెండ్ చేయించాడు.

సాయంకాలమే పోలీసులు ఊరేగింపు తీశారు. స్టేషనుబయట యింతవరకూ తమకేం పట్టనట్లుగా నుంచున్న చెట్టు కొత్తగాలికి తీవ్రంగా కదిలాయి.

—ooo—

# సమాధి చేసేయ్!

అడుగు ముందుకు పడ్తుందంటే - మన
గడువు చేరువవుతుందనే అర్థం
ఆ లోపుగా మనం
అనుభవించింది
వ్యథలను—బాధలను
గాధలుగా సృష్టించు కోవడమే.
ఈ వ్యవస్థ మారనంతవరకు
మన అవస్థల ఫైళ్ళు పెరుగుతూనే ఉంటాయి.
ఫైళ్ళను చూస్తూ వేళ్ళను లెక్క పెట్టే
పీళ్ళు కారిపోతుంది బ్రతుకు-
బ్రతుకు బాటలో ఇక పన్నీటి జల్లుపడదు
ఎంతవద్దను కున్నా ఊటలా వచ్చే కన్నీటి జల్లు ఆగదు

—తమటం లక్ష్మణగౌడు.

# మధ్యతరగతి నీచత్వం లేక అవలక్షణాలు

[పాఠకులతో ముందుమాట:- ఇందులో వెలిబుచ్చిన అభిప్రాయాలన్నీ నావికావు: చాలా మట్టుకు నా దగ్గరి మిత్రులు కబుర్లలో వెలిబుచ్చిన భావాలు క్రోడీకరించటం జరిగింది- పాఠకులు అన్ని భావాలలోనూ ఏకీభవించక పోవచ్చు- ఈ టాపిక్ మీద విభిన్నాభిప్రాయాలకు స్వాగతం: నేనూ మధ్య తరగతి మనిషినేమరి:]

మధ్యతరగతి వ్యక్తుల అవలక్షణాలు:-

1. ఇప్పుడు రోడ్డు మీద ముష్టెత్తుకుంటున్నా తన తాతల వైభవం గురించి కలలు కంటూ, ఘనంగా చెప్పుకుంటూ, ఇప్పుడు తను అందుకు ఏ మాత్రమూ తీసి పోనని అనుకుంటూ ఉంటాడు.

2. మీయొక్క విలువని మీ వంశ వృక్షం బట్టి కడతాడు- మీరు ఇప్పుడు IAS ఆఫీసరయినా మీ తాతల పేరులు కనుక్కోవాలి. "ఓహో! వంటలు చేసే విస్సన్న మనవడివా"? అని తీసి పారేస్తాడు-ఒకవేళ మీ తాతలు నేతులు తాగినా, మీరు ఓ భాయి షిర్ల్ హోటల్లో చెఫ్ (పెద్దవంటాడు)గా నెలకి మూడువేలు పుచ్చుకుంటున్నా...."ఓస్ వంటవాడివిట్రా? మీ తాతలెలా ఉండేవారు! ఓ హో? భూపాటి ధర్మన్నగారి ఘనతేమీ చెప్పను!" అంటూ మిమ్మలి తీసిపారేస్తాడు - పోనీ మీ తాతలూ నేతులు తాగి, ప్రస్తుతం మీరూ నేతులు తాగుతే, మీ బంధుగణంలో లోపాలు వెతుకుతాడు- "మీ వేలువిడిచిన మేనత్త ఆనాడో సిన్మావాడు లేవదీసుక మద్రాస్ పోయేడు కాదూ!" అంటాడు ఆ సినిమాల వాడు తమ కులం వాడే అయినా, వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుక కాపురం చేస్తున్నా సరే ఈ ముద్ర మాత్రం వేస్తాడు. "వీడు కామన్నగారి కామాక్షి మేనల్లుడే: అదే ఆ లేచిపోయింది లేదూ? దాని మేనల్లుడు!" సరి...మీపని:

3. వాడికి మగపిల్లలుండి. మీకు ఆడపిల్లలుంటే వాళ్ళ అసలు నీచత్వం బయట పడుతుంది. ఆ కొడుకులు గుమస్తా పనులు చేస్తున్నా వాళ్లు IAS ఆఫీసర్లయినట్లు మీతో కబుర్లు చెప్తారు- వాళ్ళు స్కూల్ ఫైనల్ ట్రింకిల్ కొట్టించి పాసయితే, బి. ఏ, వరకూ చదివి మానీసి నట్టు కూస్తారు వాళ్ళకున్న అయోగ్యతలు, దుర్గుణాలు యోగ్యతలూ, సద్గుణాలూగా వర్ణిస్తారు-

ఎంద రెందరో పిల్లల్నిస్తామని వస్తున్నారు. వలానా మాజీ మంత్రిగారి కొడుకు యొక్క వేలువిడిచిన బావమరది మేనగోడల్నిస్తామని చెప్పవచ్చేరు. పది

వేలు కట్నం, లాంఛనాలు–ఆ 'పిల్లకి ఉండవలసిన హంగులన్నీ ఉన్నాయా'అంటే 'ఆ పిల్లకి చిన్న నాడు పోలియో వచ్చి ఓ కాలు పడిపోతే నేంగాక?' 'మరి చేసుకో లేదేం?' మావాడన్నాడూ....ఇప్పట్నించి పెళ్ళెందుకమ్మానాకు...మరో నాలుగేళ్లు పోనీ అని. "మీ గుమస్తా కొడుక్కి....లేక బి.టెక్ చదివిన కొడుక్కి పదివేలు కట్నం కావాలంటారు?" అని మీరు అడగలేరు!

4. పీళ్ళు కోడలిని తమ ఇంటిమనిషిగానూ ; మొగుడు పెళ్ళాన్ని తన దగ్గరి దానిగానూ చూడరు– అత్తగారు చచ్చేవరకూ, లేదా కొడుకూ కోడలూ వేరుపడే వరకూ, ఆ ఇంటికి కోడలిగా వెళ్ళిన ఆడపిల్ల పరాయిదాని గానే చూడబడుతుంది. ఫలానా వారు మీ నాన్న ఇచ్చిన కట్నంకన్నా ఎక్కువ ఇస్తాం అని వచ్చేరు ... అయ్యో! నా కట్నమా." అని జీవితాంతం వాపోతూనే ఉంటుంది అత్తగారు. అది కాక, పండక్కి మీ వాళ్ళు ఏం పెడతారు? అన్న అడ్వాన్స్ డిమేండ్లు ఉంటూనే ఉంటాయి. ఇంక మొగుడేం అంటాడు కొత్తమోజు తీరేక–

అందువల్ల సార్! మీకు ఆడపిల్లలు కాని ఉంటే ఇటువంటి ఇళ్ళల్లో పడేసే కన్నవాళ్ళ మరోకులం వాడికికాని, భాషవాడికికానీ మతం వాడిక్కానీ,వాడే యోగ్యుడై నప్పుడువాడికిచ్చి పెళ్ళిచెయ్యడం ఉత్తమం–అదెక్కడో ఓ పిల్లతండ్రికి కోపంవచ్చి "మీ పాలిట పడేసే కన్న రంగసానికి నా కూతుర్ని అప్పచెప్పడం నయం! అక్కడ మొగుడిబాధ, అత్తగారి బాధ ఉండదు. బండెడు చాకిరీ, చాలీచాలని తిండీ ఉండదు – ఏటా పిల్లల్ని కని అస్థిపంజరంలా మిగలడం ఉండదు – సుఖ పడుతుంది" – అని, చర్రున లేచి, కండువా భుజాన వేసుకపోయాడట!

5. ఊళ్ళో వార్తలు, టముకువేసే బారికాడిలో, ఒక చోట్నించి మరో చోటికి జీతం బత్యం లేకుండా చేరుస్తారు – ఆ వార్తలకి చిలవలూ పలవలూ తగులుస్తారు – ఎవరింట ఏవంటలు వండుకున్నారో అన్న అతిచిన్న సంగతినించి ... చీరలు కొనుక్కుంటే వాటిగురించీ-వాటిని ప్రదర్శిస్తూ. నగలు చేయించుకొంటే వాటిని ప్రదర్శిస్తూ, కొడుకులు, కూతుళ్ల చిన్న చిన్న ప్రయోజకత్వాలు...ఇవన్నీ టముకలుకొట్టి, ప్రదర్శనలు ఉచితంగా ఇచ్చి; ఇంక పక్కింటి పార్వతమ్మ గురించీ, ఆమె మొగుడు పర్వతరావు గురించి ఉన్నవీలేనివీ స్కేండల్స్ ప్రచారం చేయగా, ఆ పార్వతమ్మా పర్వతరావులు కూడా వీరిగురించి ఆ విధంగానే టముకు వేయుదురు.

6. మొగుడు పెళ్లాన్ని హింసించడం – వచ్చిన నష్టాలకి ఆమే బాధ్యురాలనడం – ఒక పెళ్లాం ఉండగా మరో అఫేర్ నడపడం – తాగొచ్చి తన్నడం – ఇన్ని చేసినా అమ్మ కొడుకుని సపోర్టుచెయ్యడం ...ఇవన్నీ నీచత్వపు మరికొన్ని లక్షణాలు

ఇది నీచత్వం సంగతి కొంతవరకు -

ఇంక వీళ్ల "ప్రిటెన్షన్స్" గురించి -

సంఘంలోని నైతిక విలువలని నిలబెట్టవల్సింది తమ బాధ్యతేనని అనుకుంటారు.

పురాణయుగంలోని ఆచార వ్యవహారాలన్నీ, స్త్రీపాతివ్రత్యాన్నీ, గృహస్థ ధర్మాలనీ, మగాడి ఆధిక్యతనీ. ఆడదాని అడగి మడుగి ఉండవలసిన అవసరాన్నీ క్రతువులూ, వ్రతాలూ, ఉపవాసాలూ, నోములూ, పూజలూ వంటి "రైట్యువల్స్"ని నీరు పోసి బతికించి ఉంచేది వీరే.

అటుఉన్న వాడికీ, ఇటు లేని వాడికి మధ్యని గోడగా నిలబడి, ఇటు ఆస్తికత్వానికి మధ్యని అటు నాస్తికత్వానికికాపుగాఉండి, అటు నమ్మకాలకీ, ఇటు అపనమ్మకాలకీ మధ్యన కాపలాగా నిలబడి రెండింటికీ ఓ కాపుకాస్తున్నది వీరే -

ద్విస్వభావం, ద్వంద్వప్రకృతి వీళ్లలోనే ఉంది అటు ఉన్నవాడిలోనూ లేదు - ఇటు లేనివాడిలోనూ లేదు - ఏమిటీ ద్వంద్వ ప్రకృతి? దంద్వ ప్రకృతి ఏమిటంటే :

1. అటు ఉన్నవాడికి కాకాపడుతూనే వాడిలా అవదామని ప్రయత్నిస్తూ, దేవుళ్ళని మొక్కుతూనే, ఇటు లేనివాడి మీద జాలీ, కరుణ, సానుభూతి ప్రకటించడం.

2. ఆకలి మీదా, లేమిమీదా, సంఘంలోని ఎక్కువ తక్కువల మీదా ధణుతు ఏగిరిపోయినట్లు కావ్యాలూ, కథలూ, నాటకాలూ, నవలలూ రాసేస్తూ, అటు పైసా మీద పైసా కూడ వేసి మేడలూ మిద్దెలూ కట్టి ఓ జమీందారుగా తయారవుదామని ప్రయత్నం-

3. ఇంటెలిజెన్షియా అంతా వీళ్ళనుండే పుట్టేరు-అటు డబ్బున్నవాడికీ ఇంటలెక్చ్యువల్‌గా ఉండడానికి సమయంలేదు, ఇటులేనివాడికీ సమయంలేదు-ఉన్న సమయం అంతా ఈ దిగువ మధ్య తరగతి వాడికే

4. వీడెటూ తేల్చిచెప్పడు-గోడమీద పిల్లి వాటంగా రెండువేపులా చూస్తూ ఇటు అటు కూడా చూస్తూ ఉంటాడు.

5. అద్దె కొంపలూ, అద్దె బతుకులూ ఏ ఊళ్ళోనన్నా వీళ్ళవే ఎక్కువ. అటు ఉన్నవాడు ఎన్నో ఇళ్ళు కొంటాడు, మనుషులని అద్దెకి తీసుకుంటాడు ఇటు లేని వాడు పూరిగుడిసె వేసుకొని జాగాస్వంతం చేసుకుంటాడు.

6. ఎప్పుడో రాబోయే పుస్తెకట్టబోయే భర్త కోసమని కన్నెపిల్ల శీలాన్ని జాగ్రత్తగా కాపాడి, ఆమెకాలు జారుతే ఆమె పరువేకాదు తన పరువు, తన వంశం పరువు పోతుందనుకుంటాడొకపక్క. మరోపక్క వుమన్స్‌లిబ్ అని వీళ్లె అరు

స్తారు-అటు ఉన్నవాళ్ళకీ శీలం గురించి ఖాతరు లేదు-ఇటు లేనివాడికీ ఖాతరు లేదు-వీళ్ళు లిబరేట్ అయిపోయే ఉన్నారు సెక్స్‌పరంగా-

7. తనకి మనసున్న, ముక్కువయిన ఆడదానికి వెలకట్టి తాత్కాలిక సుఖం కొనుక్కుంటుకి ఎంత సొమ్మయినా ఇవ్వడానికి తయారయ్యే ఈ మనిషే, తనకి పెర్మనెంట్ సుఖాన్నీ, పెర్మనెంట్ కంపెనీనీ ఇచ్చే ఆడదాన్ని కట్నం లేకుండా రానివ్వడు-

8. వరకట్న నిర్మూలన, విధవా వివాహాలు, కులమతభేద నిర్మూలన జరగాలని గొంతు చించుకు పోయేట్టు అరిచి; కలాలు అరిగిపోయేటట్లు రాసిన వీళ్ళే తమ వరకూ వచ్చేసరికి వాటికి తిలోదకాలిస్తారు. అవి ఎక్స్‌పోర్ట్‌కే కాని స్వంత వాడకానికి పనికిరావంటారు.

9 ఏ స్వాములవారొచ్చి వేదాంతోపన్యాసం ఇచ్చినా మూగినవాళ్ళలో నూటికి ఎనభై శాతం వీళ్ళే వుంటారు. ఏ కమ్యూనిష్టు వాడైనా, ఏ విప్లవ వాదైనా మీటింగు పెడితే....

10. వేటాడబడే కుందేలుతో పరుగెడుతూనే, వేటాడే వేటకుక్కతోనూ పరుగుతీసేది వీరే డాక్టర్ జికిల్ ఎండ్ మిస్టర్ హైడ్ ఎక్కడో లేడు-వీళ్ళలోనే వాడి దెయ్యం ఉంది- రాముడు రావణుడూ స్నేహితులయి వీళ్ళ మనసులోనే మకాం పెడతారు-పంచముఖ బ్రహ్మలు ఎక్కడో ఉండరు-వీళ్ళలోనే ఉంటారు-

11. రామాయణాన్నీ, కామాయణాన్నీ, ఆర్థిక లోపాలనీ ఎనార్కీ-ప్రిన్సిపిల్స్‌నీ, బూర్జువా బురఖానీ, ప్రోలిటేరియట్ పాపగండానీ జీర్ణింపజేసుకున్నది వీరే.

12. ఏ ఎండకా గొడుగు పట్టగలిగేది వీరే-అటు కేపిటలిస్ట్ విధానందుస్తే అదీ మంచిదే అని జెప్పి వోట్లు సంపాదించి మంత్రులయి కేపిటలిస్టు పల్లకీకి బోయీలుగా ఉంటారు-ఇటు మార్క్సిజమ్‌వస్తే, "నీ ఘర్మజలం ఓ పెగ్గియ్యి.... లాగి ఆ మత్తులో వెళ్ళి ...ఆ బూర్జువాగాడి రక్తం తెచ్చి నీ ఒంటికి చందనం పూస్తాను!" అంటాడు-

13. ఏ ప్రభుత్వం రానీండి, ఎటువంటి సిస్టమ్ వ్యవస్థలో నడవనీండి, అతి ఎక్కువ లాభాలనూ, ప్రివిలేజెస్‌నూ పొందుదామనీ, లాగుదామనీ చూసేది ఈ తరగతే.

I. ఎన్ని ఆర్ట్స్ కాలేజీలూ, సైన్సు కాలేజీలూ, మెడికల్ కాలేజీలూ, ఇంజనీరింగ్ కాలేజీలూ పెట్టినా వీళ్ళ పిల్లలకే చాలవు- స్కాలర్‌షిప్ సంపాదించో ఇల్లు అమ్మో, మడిచెక్క అమ్మో, తల తాకట్టుపెట్టో, రాబోయే వియ్యంకుడికి, కొడుకుని తాకట్టుపెట్టో, పిల్లల్ని మాత్రం పెద్ద చదువులు చదివించేస్తారు-

II. ఏ మధ్యతరగతి, దిగువ మధ్య తరగతి వాడి దగ్గ కి వెళ్ళి అడగండి– "నీ కొడుకు చేతకూలి పని ఎందుకు చేయించవు? భూమి దున్నించ వేందుకు? రాళ్లు కొట్టిస్తావా? తాపీ పని, వడ్రంగి పని చేయిస్తావా? నీ కొడుకులూ కూతుల్నూ ఊడుపులూ కోతలూ పొలాల్లో ఎందుకు చెయ్యరు? నీ కూతుర్ని బ డి నాయికి కొడుక్కివ్వరాదూ ? ఎంతో ఆరోగ్యంగానూ, అందగానూ ఉంటాడు ? అని అడగండి...అప్పుడు ఆ సాత్త్వి మీకేసి ఎలా చూస్తాడో వెంటనే ఓ ఫోటోతీసి వాడు మిమ్మల్ని ఎలా అవాకులు చెవాకులు తిడతాడో టేప్ రికార్డ్ చెయ్యండి–తెలు స్తుంది వాడి నిజ స్వరూపం–

14. ఎన్ని పంచవర్ష ప్రణాళి లు వేసి ఎన్నిఉద్యోగాలూ, సదుపాయాలూ చేసినా వీళ్లకిచాలవు– ఎక్కడివాళ్లూ పట్నాల్లోమూగతారు– ఇరుకు గదులలో మగ్గు తారు– కుళాయిలలో నీరు సరిగా రావటంలేదని,విద్యుత్తు మాటమాటికి ఆగిపోతుందనీ, రైళ్లలోనూ బస్సులలోనూ రద్దీగా ఉంటుంది మరిన్ని రైళ్ళూ బస్సులూ కావాలనీ, ముష్టి వెధవలు చావాలనీ చవక యాత్రావసతిగృహాలు కావాలనీ, స్వర్గసౌఖ్యాలు ఏగాణికి తమకే అందుబాటులో ఉండాలనీ, తననీ తనపదిపైసల సంపత్తినీ కాపా డటానికి పోలీసుసిబ్బంది చాలదనీ, తమ ఇళ్లు కట్టు కుందుకి స్థలాలు, లోన్లు ఇంకా ఇంకా కావాలనీ గోలచేసేది వీరే....వీరే... వీరే!

15. ప్రపంచంలో ఏప్రభుత్వమన్నా రోజుకి ఇరవై మూడుగంటల ఏభై తొమ్మిది నిముషాలూ సతమతమవుతున్నది వీళ్లవల్ల ఉత్పన్నమయే సమస్యలతోనే.

విదేశాలనించి తిండి గింజలను దిగుమతి చేస్తున్నది వీళ్లకోసమే– న్యూస్ప్రిం ట్ని దిగుమతి చేస్తున్నది వీళ్లకోసమే– దినపత్రికలూ, వారపత్రికలూ, మాసపత్రి కలూ అచ్చువేసి, కథలూ, సీరియల్సు ముద్రణచేయించి వాటికి అందమైన బొమ్మలు వేయించి క్షణికానందోద్రేకాలను కలిగించేది వీరికే మదనా, మన్మధా, కామశా స్త్రం,కొక్కోకం ఉన్నవి వీళ్లకోసమే. సెక్స్ థ్రిల్లర్లూ, క్రైమ్ థ్రిల్లర్లూ, కబరే డాన్సులున్న సినిమాలు వీరి కోసమే ముఖ్యంగా–

ఇటులేనీ వాడికివేవీ అవసరంలేదు– అటు ఉన్నవాడికి నిజమైన జీవితంలోనే థ్రిల్లర్సు దొరుకుతూ ఉంటాయి రక్తమాంసంలో...వాడు చదివి, చూసి ఆనందిం చ నవసరం లేదూ...వాడి కాపే షెన్సూ, కాలములేదు–

అందువల్ల కోపగించుకోకండి ...మనవి మనం ఎనలైజ్ చేసుకోడం ఆరోగ్య కరం–ఇదీ మన స్ప్లిట్ పెర్సనాలిటీ–ప్రతి మనిషిలోనూ స్ప్లిట్ పెర్సనాలిటీ ఉం టుంది-కాని ఈ మధ్య తరగతిలో పుట్టి, కొన్ని ఆచారాలతోనూ, నమ్మకాలతోనూ పెరిగి, అతి తెలివి తేటలు కలిగి, వాటిని చదువుతోనూ, విజ్ఞానంతోనూ వృద్ధిచేసు కొని, దశావతారాలు ఎత్తగల చేవ ఉన్న వీళ్ళ (అంటే మన) స్ప్లిట్ పెర్సనాలిటీని తెలుసుకోడం బ్రహ్మతరం కాదు– కాబట్టి మధ్యతరగతి మనిషికి జోహార్లు!

# అంటరానితనం-రెండు నవలలు

భారతీయాంగ్ల నవలా సాహిత్యం (Indo–Anglian Fiction) లో అభ్యుదయ దృక్పథంగల రచయిత ముల్కురాజ్ ఆనంద్. 1905లో పెషావర్‌లో జన్మించాడు ఆనంద్. బాల్యంలోనే దేవాలయాల్లో, చర్చీలలో మతంపేరిట జరిగేతంతుచూచి ఆశ్చర్యపడేవాడు, జలియన్ వాలాబాగ్‌లో జరిగిన మూకుమ్మడి కాల్పులలో అమాయకంగా కర్ఫ్యూని ధిక్కరించి నందుకు పోలీసులచే బెత్తం దెబ్బలు తిన్నాడు. కాలేజీ విద్యార్థిగా ఉర్దూ, ఆంగ్లసాహిత్యాలతోపాటు మార్క్స్, మాజినీ, గోర్కీ, ప్రౌధాన్ రచనలు చదివాడు. సమాజంలోని పేదరికం, అజ్ఞానం, మూఢనమ్మకాలని చూసి, బాధపడి హేతువాదిగా పరిణతిచెందాడు. కాని ఏవాదమైనా మానవాభ్యుదయానికి పాటుపడినప్పుడే ఉపయోగపడుతుందని నమ్మాడతడు. అమృతసర్‌లోని ఖాల్సాకళాశాలలో చదివేటప్పుడు ప్రముఖ ఉర్దూ కవి ఇక్బాల్ పరిచయంతో ప్రభావితుడై ఉర్దూలో కవిత్వం వ్రాశాడు.

స్కాలర్‌షిప్ సహాయంతో 1928లో లండన్‌లో డాన్‌హిక్స్‌వద్ద తత్వశాస్త్రంలో పరిశోధన (research) ప్రారంభించాడు. అప్పుడే డాక్టర్, రాధాకృష్ణన్ వ్రాసిన 'ఇండియన్ ఫిలాసఫీ' చదివాడు. ఈ జీవితం, ఈ ప్రపంచం వాస్తవమని గుర్తించిన ప్రాచీన భారతీయ తత్త్వ శాస్త్రంలోని చార్వాక సిద్ధాంతం యొక్క గొప్పతనాన్ని గుర్తించాడు. కాంట్, హెగెల్, బ్రాడ్లీ, రస్సెల్ పుస్తకాలు చదువుతూ మతము, బాధ, అమరత్వాల గురించి చర్చించాడు. ఆడమ్, ఈవ్‌ల పాపఫలితమే ఈ మానవ ప్రపంచం అన్న బైబిల్ వాదనకు గొడ్డలిపెట్టుగా వచ్చిన 'డార్విన్ వ్రాసిన 'జీవనపరిణామం' (origin of thespecies) చదివాడు ఫ్రాయిడ్ జంగ్‌ల మనస్తత్త్వ సిద్ధాంతాల నవలోకించాడు. భారతీయ కళాసంపదపై ఎన్నో పుస్తకాలు ప్రచురించాడు.

ఐరోపాలో ఫాసిజమ్, ఇండియాలో సామ్రాజ్య వాదం వలన కలుగుతున్న దుష్ఫలితాలు గమనించాడు. ఇండియాలోని ఆర్థిక, రాజకీయ సమస్యల విముక్తికి పారిశ్రామికీకరణ, సోషలిజమ్ యొక్క అవసరాన్ని గుర్తించాడు. బర్కిలీ, హ్యూమ్, రస్సెల్‌ల మీద థీసిస్ సమర్పించి, 1929 లో డాక్టరేట్ పట్టా పొందాడు. 1932 లో గాంధిగారి సబర్మతి ఆశ్రమంలో కొంతకాలం వుండి హరిజన సమస్యను పరిశీలించాడు. 1935 లో అతని మొదటినవల, అతని నవలలోకెల్ల మాగ్నమ్ ఓపస్ (magnum opus) అయిన 'అన్‌టచబుల్' (Untouchele = అంటరానివాడు) ప్రచురించాడు. 1935 లో అతడు వ్రాసిన 'కూలీ' రష్యా

— వై. వెంకట రామయ్య.

ఐరోపాలలో అతనికి ప్రఖ్యాతిని తెచ్చిపెట్టింది. ఆ సంవత్సరమే సజ్జాద్ జహీర్ మిగతా మిత్రులతో కలిసి అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం స్థాపించాడు.

బ్రిటన్‌లో కృష్ణమేనన్‌తో కలిసి, ఇండియాలీగ్ తరఫున భారత స్వాతంత్రావశ్యకతను గురించి ప్రచారంచేసాడన్న సంగతి చాలా కొద్దిమందికి తెలుసు. తన రచనలను ఎంతగానో ఆదరిస్తున్నరష్యాని 1945లో సందర్శించాడు. ఫాసిస్టు వ్యతిరేకిగా, సామ్రాజ్యవాదవ్యతిరేకిగా, శాంతిస్థాపనకు అతడు చేసిన సేవకుగుర్తుగా 1952లో ప్రపంచశాంతి సంఘంనుండి అంతర్జాతీయ శాంతి బహుమతి నందుకున్నాడు 1968లో సమగ్ర చారిత్రక మానవతావాదం (comprehensine historical humanism) ప్రబోధిస్తూ, ఇండియాలోని విశ్వవిద్యాలయాలు సందర్శించాడు భారతీయ సంస్కృతి గొప్పతనాన్నిచాటుతూ 'మార్గ్' అనే అర్థపత్రికను నడుపుతున్నాడు. సంఘంలో పైవర్గాలచే సాంఘికంగా అణచబడి, ఆర్థికంగా దోపిడీ చెయ్యబడుతున్న వర్గాన్ని తన సాహిత్యంలో మొట్టమొదటిగా వర్గపోటాన్ని చిత్రించిన సోషలిస్టు రచయిత ఆనంద్. బహుముఖ ప్రతిభాశాలి అయిన ఆనంద్ ఇప్పటికి పదునాలుగు నవలు ప్రచురించాడు. వాటిలో ముఖ్యమైనవి: 'అన్‌టచ్‌బుల్' 'కూలీ, 'దివిలేజ్' 'ఓటల్డ్‌ఉమన్ అండ్‌దికౌ', 'దిడెత్‌ఆఫ్‌ఎ హీరో', 'మార్నింగ్ ఫేస్'.

మానవతావాదిగా కులమత వర్గ భేదాలు సమసినప్పుడే మానవాళి సుఖపడుతుందని ఆనంద్ అంటాడు. తోటి మనిషిని గౌరవించి, ప్రేమించడం, మనిషి గొప్పదనంలో నమ్మకం అవసరం అంటాడు ఆనంద్. మానవుడు ఎదుర్కొనే సమస్యలను మానవుడు మాత్రమే, శాస్త్రీయ మార్గంలో, హేతుపద్ధతిలో, మంచి ఆలోచనా మార్గం ద్వారానే పరిష్కరించుకోగలడు. అంతేగాని మతం, దేవుడు వలన సమస్యలు ఇంకా జటిల మవుతాయేగాని పరిష్కారం కావు. ప్రొటాగరస్ అన్నట్లుగా, మానవుడే అన్నిటికి కొలబద్ద(Man is the measure of all things) అన్ని విలువలను పనులను మానవ వ్యక్తిత్వంతోనే కొలవాలంటాడు ఆనంద్. మనిషే తన విధికి యజమాని. ఎన్నో శతాబ్దాలుగా విధికి బానిసలమనుకుంటూ తమకి, కనపడని, లేని విధి చేతిలోకీలు బొమ్మలుగా తమని ఊహించుకుంటూ భారతీయులు తమ భవిష్యత్తుని నాశనం చేసుకున్నారు. పాశ్చాత్య సమాజంలోని స్త్రీలతో పోల్చుకుంటే భారతీయ స్త్రీలు ఎటువంటి దుస్థితిలో ఉన్నారో తెలుస్తుంది. స్త్రీని దేవతగా, పవిత్ర మాతగా దేవాలయాల్లో పూజించటం, సంఘంలో, ఇళ్ళలో నూ వ్యక్తిత్వం లేని బానిసగా చూడటం జరుగుతున్నది మనదేశంలో. స్త్రీకి ఏ దశలో స్వాతంత్ర్యం ఉండకూడదని, బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో కొడుకు స్త్రీకి రక్షకులుగా ఉండాలని శాసించిన మనుధర్మాన్నే నేటికి చాలా మంది

భారతీయులు గౌరవించడం శోచనీయం. సాంఘిక పునర్నిర్మాణంలో పురుషునితో సమ భాగస్వామి స్త్రీ. స్త్రీ సాహచర్యం లేని పురుషుని జీవితం అసంపూర్ణం.

అంటరాని తనంపై ఆనంద్ వ్రాసిన రెండు నవలలు: 'అన్‌టచ్‌బుల్',, 'దిరోడ్.' ఒక్క హిందూసమాజంలోనే కొంతమందిని అంటరానివారిగా జమకట్టి, పునర్జన్మ, కర్మ సిద్ధాంతాల్ని అడ్డుపెట్టుకొని, సభ్యసమాజానికి దూరంగా ఉంచుతున్నాం. "ఇటువంటి ఊహ బహుశః ఏజంతువుకి తట్టివుండదని" అన్‌టచ్‌బుల్, నవలకు పరిచయ వాక్యాలు వ్రాస్తూఇ. యమ్ పాస్టర్ అన్నాడు. హిందూ సమాజంలో అంటరానితనం పాదుకొని పోయింది అది మత సంప్రదాయాల మాటున బతుకుతున్నది. అంటరానివారికి జరిగిన ఘోర అన్యాయాల్ని గుర్తించిన గాంధీజీ వారికి హరిజనులు అని నామకరణం చేసారు.

1933లో వ్రాయబడిన 'అన్‌టచ్‌బుల్' లోని కథానాయకుడు హరిజనుడయిన బాఖా. అతని జీవితంలో ఒక రోజు జరిగిన సంఘటనల చిత్రణే ఈ నవల. తన తండ్రి తిట్లతో బాఖాకి ఉదయం ప్రారంభమవుతుంది. రోజుకు రెండుసార్లు మరుగుదొడ్లు శుభ్రం చెయ్యడమే అతని వృత్తి, మనం విసర్జించిన మలమూత్రాలను శుభ్రంచేసి, మన పరిసరాల శుభ్రతను కాపాడుతున్న పాకీవారిని మన సమాజం హీనంగా చూస్తుంది. వీరి ఇళ్ళలో మనుషులు జబ్బుపడినప్పుడు డాక్టరు కూడా రాడు. మరుగుదొడ్లు శుభ్రం చేసిన తర్వాత, మెయిన్ రోడ్ దేవాలయ పరిసరాలు ఊడుస్తాడు బాఖా. పండ్లకొట్లు, మిఠాయి షాపులు, కిళ్ళీకొట్లు చూస్తూ ఆనందిస్తాడు. ఓ కిళ్ళీకొట్టు దగ్గర ఆగి, ఒక సిగరెట్టు పాకెట్టు కావాలని ఒక అణా అక్కడ పెడతాడు. షాపు యజమాని ఆ నాణెం మీద నీళ్ళుజల్లి తీసుకుంటాడు. ఆ తర్వాత 'ఓ కుక్కకు ఓ మాంసం ముక్క విసరివేసే కసాయివానిలా' సిగరెట్టు పాకెటు బాఖావైపు విసరివేస్తాడు. తర్వాత పావలా జిలేబీలు కొనుక్కున్నప్పుడు కూడా ఇలానే జరుగుతుంది. పావలా నాణాన్ని నీళ్ళతో కడిగి తీసుకుని, జిలేబీ పొట్లాన్ని క్రికెట్ బంతిలా బాఖావైపు సొరవేస్తాడు మిఠాయి వాలా. ముందుకు నడుస్తూ, హుషారులో బాఖా లల్లాజీ అనే బ్రాహ్మణుని 'అంటుకోవడం' జరుగుతుంది. లల్లాజీ కేకలకి చాలా మంది పోగవుతారు. అందరూ బ్రహ్మణ్ణి మైల పరిచినందుకు బాఖాని తిడతారు. అగ్రకులం వాడిననే గర్వంతో లల్లాజీ బాఖాని చెంప మీద కొడతాడు, బాఖా తలకుద్ద జారి క్రింద పడుతుంది. చేతిలోని జిలేబీలు మట్టిలో పడ్డాయి. అతని కళ్ళలో అవమానాగ్ని ప్రతిజ్వలిస్తుంది ; శరీరం కోపంతో వూగి పోతుంది.

ముందుకు నడుస్తూ, సంఘంలో తమ పరిస్థితి ఏమిటో తెలుసుకుంటాడు. బాఖా : "మేమెందుకిలా అవమానించబడాలి? అవును. అగ్రకులాల వారికి మేము పాకీవాళ్ళం. మేము వారి మురికిని శుభ్రంచేస్తాము కాబట్టి వాళ్ళు మమ్మల్ని మురికి

వారంటూ వ. (They think we are more dirt because we clean their dirt.) నేను అంటరానివాడిని."

అతడి కొరకు ఇంకో అవమానం ఎదురు చూస్తూ వుంది. దేవాలయం ఆవరణకిచేరుకున్నప్పుడు అక్కడ అతనికి అర్థంకాని భగవన్నామములు స్మరిస్తున్నా రెందరో భక్తులు. లోన ఏమి జరుగుతుందో చూద్దామని, ద్వారము దగ్గరకు వెళ్ళి, చీకటి గదని, గదిలోని విగ్రహాలను తొంగిచూస్తాడు. వెంటనే అక్కడి భక్తులు గుడి 'మైలపడింది' అని అరుస్తారు. అప్పుడే ఒక పూజారి తనను బాఖా చెల్లెలు అంటుకోవడం వలన మైల పడ్డానని బిగ్గరగా అరుస్తాడు. మరుగదొడ్లు శుభ్రం చేస్తున్నప్పుడు ఆ పూజారి తనను పట్టుకోబోయాడని అన్నతో చెప్పుకొని ఆ చెల్లెలు ఏడుస్తుంది. ఆ పూజారివిచంపి వెయ్యాలన్నంత కోపంవస్తుందిబాఖాకి.

తన చెల్లెల్ని ఇంటిదగ్గర విడిచి, భోజనం తెచ్చుకోవడానికి కంసాలి ఇంటికి వెళతాడు. అక్కడమూఢాచారాలు పాటిస్తున్న ఆ ఇంటి ఇల్లాలు బాఖా తమ ఇంటిని అంటుకొని మైలపరచాడని గోలచేస్తుంది; నాలుగో అంతస్తునుండి చపాతీలు క్రిందకు పారవేస్తుంది. దుఃఖం దిగమింగుకుంటూ, మట్టిలో పడిన చపాతీలు ఏరుకుని వెడతాడు బాఖా.

అతని మనసుని ఇంకో సంఘటన బాగా గాయపరుస్తుంది. క్రికెటు ఆడు కుంటూ ఒక అగ్రకులం బాలుడు బంతి తగిలి బాగా గాయపడతాడు. బాఖా ఆ బాలుని ఇంటికి మోసుకొని వెళితే, ఆ బాలుడి తల్లి అంటరానివాడు తన కొడు కుని అంటుకొని మైల పరిచాడని కోప్పడుతుంది; బాఖాయే తన పిల్లవాడిని కొట్టి గాయపరిచినటు అతనిని తిడుతుంది.

ఈ అస్పృశ్యతకు విముక్తి లేదా? అని బాధపడుతున్న బాఖా ముందు ఈ నవలా రచయిత ఆనంద్ మూడు మార్గాలు సూచిస్తాడు. ఒకటి, అంటరాని వారంటూ లేని క్రైస్తవ మతాన్ని స్వీకరించడం. రెండు, గాంధీజీ ఆలోచనా సరళి ప్రకారం హరిజనులకి ప్రేమించాని సంతృప్తిపడటం. మూడు, కొన్నిరకాల పనులు చెయ్యడం వలన కొంతమందిని అంటరానివారు, పాకీవారు అంటున్నాం. కనుక మరుగుదొడ్లు శుభ్రం చెయ్యడానికి 'ఫ్లష్' పద్ధతి ప్రవేశపెట్టినట్లయితే వారికిబాధ తప్పుతుంది. పారిశ్రామికీకరణ ఒక్కటే దళిత జాతుల్ని ఉద్ధరించే మార్గమని సూచిస్తాడు ఆనంద్. 'అన్‌టచబుల్' నవల తర్వాత సుమారు ముప్పయి ఏళ్ళకు వ్రాయబడిన 'దిరోడ్' అనే చిన్న నవల కూడ అంటరానితనమే కథా వస్తువు. ఈ ముప్పయి ఏండ్లలో స్వాతంత్ర్యమొచ్చి, ప్రజాపాలన ఏర్పడింది. సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో ఎన్నో మార్పులు వచ్చిననప్పటికి సంతృప్తి కర మయిన అభివృద్ధి సాధింపబడలేదు. అంటరానితనాన్ని నేరంగా పరిగణించి భారత రాజ్యాంగంలో పొందుపరిచినప్పటికి, హరిజనులపై అత్యాచారాలు ఇంకా

జరుగుతూనే వున్నాయి. భూస్వామ్య వ్యవస్థ పాతుకుని పోయిన గ్రామాలల్లో హరిజనుల పరిస్థితి హృదయ విదారకంగా వున్నది.

రాజస్థాన్‌లోని గోవర్ధన్ అనే గ్రామంలోని హరిజనులు, భిఖూ అనే హరిజన యువకుని నాయకత్వంలో, అగ్రకులస్థుడయి ప్పటికి మంచి వాడయిన లంబర్దార్ (గ్రామపెద్ద) ధూలీసింగ్ సహాయంతో, దగ్గరున్న పట్టణాలని కలుపుతూ రోడ్డునిర్మించడానికి పూనుకుంటారు. ఆగ్రామ భూస్వామి, సర్పంచ్ అయిన ఠాకూర్‌సింగ్ సంప్రదాయాల పాలె గూడులో కూర్చొని, కూలీ సంపాదిస్తున్న హరిజనులపై కోపం పెంచుకుంటూ వుంటాడు. ఇదివరటిలా, హరిజనులు తమ దయా దాక్షిణ్యాలపై ఆధారపడకుండా, కష్టపడి డబ్బు సంపాదించుకోగలుగుతున్నారు. సర్పంచ్ కొడుకు, లంబర్దార్ కొడుకు ఏకమై హరిజనుల ఇళ్ళను తగులబెడతారు. అగ్రకులస్తులందరూ కలసి ఆరోడ్డు నిర్మాణానికి అడ్డు తగిలినప్పటికీ, ప్రభుత్వసహాయంతో సమాజ పురోగతికి చిహ్నమైన రహదారిని పూర్తి చెయ్యగలుగుతారు అగ్రకులాల వారిచే అవమానింప బడిన భిఖూ ఆగ్రామంవదలి, ఢిల్లీకిబయలుదేరతాడు తన భవితవ్యాన్ని వెదుక్కుంటూ. పట్టణాలలో ఆర్థిక సమస్యలునాయేగాన్ని కులమతాలకు కొంత సడలింపువున్నది.

కులమనేది చాల మందికి తమ ఆధిపత్యం గాపాడుకోవడానికి, తమ దుర్మార్గాల్ని కప్పిపుచ్చుకోవడానికి ఉపయోగపడే ఒక ముసుగు. ఈనవలలోని గ్రామపూజారి సూరజ్‌మణి, బ్రాహ్మణుణ్ణనే అహంకారంతో హరిజనులను అవమానిస్తాడు. 'దేవుడుదరిద్రనారాయణుడు, అంటూ ధర్మపన్నాలు వల్లిస్తూనే, హరిజనులను దేవాలయంలోనికి రానివ్వడు. కాని వారిచ్చే మామిడిపండ్లను స్వీకరించడానికి అతనికి అభ్యంతరంవుండదు. హరిజనులకు దేవాలయ ప్రవేశం కల్పించినంత మాత్రాన వారి సమస్యలు తీరిపోవు. కాని సభ్యమానవులుగా వారికాహక్కు అవసరం.

మానవజాతి సృష్టించిన వాటిలోకెల్ల అతిహేయమైన కర్మ సిద్ధాంతాన్ని గర్హిస్తాడు ఆనంద్. ఎన్నోసంవత్సరాలనుండి అణగ దొక్కబడుతున్నప్పటికీ. చాలమంది హరిజనులు కర్మ సిద్ధాంతాన్ని పూర్ణిన్మవి అమాయకంగా అంగీకరిస్తూనేవున్నారు, తమస్వయంశక్తిపై ఆధారపడకుండా దైవానుగ్రహానికి ప్రాకులాడుతున్నారు. అగ్రకులస్తులు తమ పాకల్ని తగలపెట్టినప్పుడు, భిఖూతల్లి లక్ష్మి కాళికాలయంముందు మోకరిల్లి "తల్లీ! నీకు హారతిఇవ్వటం మర్చిపోయినందుకు మాపాకల్ని హారతిగా పుచ్చుకున్నావా?" అని రోదిస్తుంది ఈకర్మసిద్ధాంతం నుండి బయటపడనంత కాలం భారతదేశం అభివృద్ధి చెందజాలదు.

ఈరెండునవలలు భారతదేశంలో వస్తున్నమార్పులను సూచిస్తాయి. 'అన్‌టచిబుల్'లోని బాబా తననజరిగిన అన్యాయల్ని మూగబాధతోభరిస్తాడు. కాని దిరోడ్, లోని భిఖూ అక్రమాన్ని సాధ్యమయినంతవరకు ఎదుర్కొంటునే, ఇవరకు తను పుట్టి, పెరిగిన గ్రామాన్ని వదలిపెట్టి,కులమతాలకు అంతగా పట్టింపులేని భారత రాజధానికి పయనిస్తాడు.

కథానిక

# ఓ శవం కథ

ఆ రోజు **జనవరి ఒకటవ** తేది. కొత్త సంవత్సరము కావడంచేత దేశం నలుమూలల నుండి ఏడుకొండల వాడి దర్శనం చేసుకోవాలని, తండోప తండా లుగా ప్రజలు వస్తున్నారు. తిరుపతి తూర్పు రైల్వే స్టేషన్ మనుష్యులతో కిక్కిరిసి చాలా రద్దీగా వుంది. స్టేషన్‌కి పడమటి దిక్కుగా కొంచెం దూరంలో పోలీసు స్టేషన్ ఉంది. దానికి కొంచెం ఉత్తరాన గోవింద రాజుల స్వామి ఆలయముంది. ఈ రోడ్లు కలిసే కూడలికి ఒక ప్రక్కన ప్రాణం లేని మనిషి కళేబరం పడివుంది. ముతకి గుడ్డ ఒకటి శవం మీద పడి ఉంది. ఆ దారిలో నడిచేవారినెవరినీ ఆశవం ఆకర్షించడం లేదు. కొంతమంది యాత్రికులు శవాన్ని చూసినా చూడనట్టు పోతున్నారు. మరి కొందరు సహాయం చేయ లేక పోయినా సానుభూతిగా శవం వంక చూసి వెళ్ళి పోతున్నారు. కూడలి మధ్య ఉన్న ట్రాఫిక్ కానిస్టేబుల్ కూడా రోడ్డు ప్రక్కన పడి ఉన్న శవాన్ని చూసి చూడనట్టుగా తన డ్యూటీ తాను చేస్తున్నాడు. ఇంతలో ఒక నడి వయస్సు వ్యక్తి దైవ దర్శనానికి వెళ్తూ, శవాన్ని చూచి స్తంభించి పోయాడు. అది చూసిన పోలీసువాడు బేరం తగిలిందని భావించి శవం దగ్గర నిలిచియున్న వ్యక్తి దగ్గరకు వచ్చాడు. ఆవ్యక్తిని చూసి.

ఏమయ్యా! ఈ శవాన్ని గుర్తుపట్టగలవా? ఏవూరూ? పేరేంటి? ఎక్కడ? ఏపని చేస్తున్నావు? అని ఇంటర్వ్యూలో నిరుద్యోగిని అడిగినట్లు అడిగాడు. అ వ్యక్తి శవం తాలూకూ ఆచూకీ చెప్పాలను కొన్నాడు. అంతలోనే అతనికి ఆలోచన వచ్చింది "ఒకవేళ తను శవం తాలూకూ ఆచూకీ చెప్తే తాను కూడా పోలీసు స్టేషన్‌కి పోవలసి ఉంటుంది. అంతేగాక అక్కడ శవ పరీక్ష తరువాత శవ దహనానికి అయ్యే ఖర్చులు, వగైరా, ఆపైన పోలీసు వాళ్ళకూడా ముడుపులు చెల్లించవలసి ఉంటుంది. ఒకవేళ పోలీసు వాళ్ళకు కేసులు లేకపోతే లేదా తానిచ్చిన ముడుపు చాలకపోతే తనమీద కేసు బనాయించవచ్చు. ఎందుకొచ్చిన తద్దినం ఎలాగు చచ్చినవాడు చచ్చాడు. వాడు ఫలానా వాడని చెప్తే వాడికి ఒరగ బోయేదిలేదు. పైగా వాడి బంధువుకి అప్రతిష్ట." అని అనుకున్నాడావ్యక్తి. అందుచేత అతడు ఒక అపరిచితునిలాగా నటిస్తూ –

"ఆశవం ఎవరిదో నాకు తెలియదు, పైగా నాదీ పై వూరు. దైవ దర్శనానికి

—షేక్ నజీర్.

వచ్చాను." అని చెప్పాడా వ్యక్తి. "ఛీ! బేరం చేతికొచ్చినట్లు వచ్చి జారి పోయింది" అనుకుంటూ త ిగొక్కుంటూ పోలీసు తిరిగి తన స్టేజీ మీదకు వెళ్ళి పోయాడు.

ఒక పక్కన భక్తులు చాలాదూరం నుండి చాలా ఖర్చు పెట్టుకొని ఆ ఏడు కొండల వాడికి ముడుపు చెల్లించడానికి వెళ్తుంటే, అదే ముడుపును శవాన్ని అడ్డం పెట్టుకొని భక్తుల నుండి లాగాలని పోలీసు ఇంటి కుక్కలా కాచుకొని ఉన్నాడు. పాపం! ఆశవం బతికున్నంతకాలం తన వాళ్ళకి, దేశానికి బరువేగాక, చచ్చాక కూడ దేశానికి బరువైంది. ఒక్క మాటలో చెప్పాలంటే దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందేగాని, దేశం ఏమాత్రం ప్రగతి సాధించింది? దేశ జనాభా శవప్రాయంగా ఉంది. జాతిలో నవచైతన్యం పుట్టనంత వరకు దేశానికి, శవానికి తేడా ఏం ఉంది?

---

# "భూమిని నడిపేవాడు"

కృధిత సంద్రాల్ని తోడుకుని
భూమండలాన్ని చీల్చిన కూలీలు
టోపీలెత్తి బిచ్చ మడుగుతున్నారు
టోపీలేకాదు
గడ్డపారలూ ఎత్తగలరు,
సముద్రాన్ని వెంట తెచ్చిన వాడు
నిన్న బిచ్చ మడుగుతున్నాడు
సముద్రాలే కాదు
సర్వశక్తులూ
వాడి వెంటనడుస్తాయిప్పుడు
ఓటమిని బుజానేసుకుని
హస్తాన్ని వైపు పోతున్నాడు
శస్త్రాల్ని బుజానెత్తి
తూర్పున మొలుస్తాడు
భూమిని నడిపేవాడు.

—శ్రీధర్

# సెప్టెంబర్ నెల తెలుగు కథలు-ఒక సర్వే

[మన పత్రికలు మోసుకొస్తున్న కథల ఊసు తెప్పుకోటం అవసరం. గట్టి పొట్టూ తేల్చుకోటమూ అవసరం. ఆ దిశలో సాగిన ఓ ప్రయత్నం ఇది. సెప్టెంబర్ నెలను మాత్రమే పరిశీలించటం జరిగింది— సం.]

గత మూడు-నాలుగు సంవత్సరాలలో తెలుగు పత్రికలు విపరీతంగా పెరిగి పోయాయి. పత్రికలతోపాటు వారం వారం - నెలనెలా వెలుగులోకి వచ్చే కథల సంఖ్యాపెరిగింది. నేడు ఉత్పత్తి అవుతూన్న సాహిత్య ప్రక్రియల్లో (కవిత, కథానిక, వ్యాసం, నవల, నాటకాలలో) కథానిక స్థానం రెండవది. మొదటి స్థానం కవితలదని చెప్పాలి కాని, కథలు వెలుగులోకి వచ్చినంతగా కవితలు రావడం లేదు.. అది వేరే విషయం. నవలల విషయం వదిలేస్తే: కథ – కవితల విషయంలో పత్రికా సంపాదకులు కొత్త-పాతల భేదాన్ని పాటించక, ఏ మాత్రం బాగున్నా కొత్తవారి కథల్ని సైతం ప్రచురిస్తూనే వున్నారు. కాకపోతే; కొంత (8 నెలల నుంచి 3 సంవత్సరాల వరకు) ఆలస్యంగా-అంతే.

ఇంత అధిక సంఖ్యలో వస్తూన్న కథల్లో మంచి కథలు రావలసినన్ని రావ డం లేదని నేను జూలై అభ్యుదయలో (రప్పల్లో వెతకాల్సిన రవ్వలు) అంటే, శ్రీ దాశరథి రంగాచార్య గారు, ఆగస్టు అభ్యుదయతో "ఈనాడు తెలుగు దేశంలో లెక్కకు మించిన నవలలు, కథలు వస్తున్నందుకు విచారించాల్సిన పనిలేదు ; అభ్యుదయ వాది గర్వించాలి ; పత్రికలు ఎక్కువౌతున్నందుకు ఏడవాల్సిన పని లేదు - సంతోషించాలి. వచ్చే సాహిత్యం సాంతం ఏనాడూ ఉత్తమ సాహిత్యం కాలేదు ; అందులో మంచివి వెదకడానికి శ్రమించ వలసిన బాధ్యత పరిశీలకుల మీద వుంది, గంప గుత్తగా మొత్తం చెత్త కథలే వస్తున్నాయనడం సద్విమర్శ కుని లక్షణం కాదు... విమర్శకుడు సాహిత్యాన్ని తరచి, మంచివాటిని ఎత్తి చూప వలసిన అవసరం ఎంతయినా వుంది"—అన్నారు.

రంగాచార్యగారి ఉత్తరం చదివాక నేను మంచి కథలను మిస్సవుతు న్నానా-అని ఒకసారి తరచి చూశా, సరే! సంవత్సరం పొడవునా వచ్చే మూడు నాలుగు వేల కథల్ని చదివి చెప్పడం ఒక్కడితో అయ్యే పని కాదు. అదీగాక, అన్నం వుడికిందీ లేనిదీ చూడ్డానికి పాత్రలో చేయివేసి పిసకాల్సిన పనిలేదు. రెండు మెతుకులు పట్టిచూస్తే చాలు. అదే ఉద్దేశ్యంతో ఒక నెలలో వచ్చే మొత్తం తెలుగు దిన, వార, మాసపత్రికలు ముందేసుకుని రంగాచార్యుల మాటలు గుర్తుం చుకొని, ప్రగతి ఖానాలూ, సామాజిక చైతన్యం, కొత్త కొలబద్దలు - చదువుతూ

పోయాను. సుమారుగా 200 కథలు చదవాల్సి వొచ్చింది. నిజం చెప్పొద్దూ: గొప్ప కథ అనదగ్గది ఒక్కటంటే ఒక్కటి దొరకలేదు నాకు. బాధనిపించింది. నాకేమైనా దృష్టి దోషం వుందా – లేక నా "రుచి"లో ఏమైనా లోపమా : అని తరచి మళ్ళీ మళ్ళీ చదివాను. తెలుగు వాడు గర్వపడే కథ – అని తలెత్తుకుని చెప్పుకునే కథ ఒక్కటి దొరకలేదు. కనీసం వో పది కథలన్నా మంచివి దొరికి వుంటే ఎంతో సంతోషించే వాడిని.

'మంచి కథ'—అంటే ఏమిటి?

"లోకాన్ని, మానవ లోకాన్ని, మానవనైజాన్ని అర్థంచేసుకొని, మనిషి ఈ లోకంలో, ఈ సంఘంలో సభ్యుడిగా వుండేట్టు చేసే కథలు మంచి కథలు".

"నాలుగు కాలాల పాటు గుర్తుండేవి; మనసులో మెదిలేవి–మంచికథలు.

"మన గురించీ, మన చుట్టూ వుండే ప్రపంచం గురించీ సరియైన ఆలోచన కలిగించేవి మంచి కథలు.—ఈ విషయాలను దృష్టిలో వుంచుకొని సెప్టెంబర్ 79 లో వచ్చిన కథల పరిశీలన జరిగింది. వాటిలో వున్నవి చాలా వరకు

> **పరిశీలించిన కథలు – 200**
>
> **పరిశీలించిన పత్రికలు – 15**
>
> (వార, మాస పత్రికలు)

ప్రేమకథలు; పెళ్ళి చూపుల కథలు: బస్‌స్టాప్ కథలు, గుమాస్తా కథలు, సైకాలజీ కథలు, స్టూడెంట్ల రొమాన్సు కథలు, సన్యాసుల సినిమా కథలు, సెంటిమెంట్ కథలు, సర్కారు–సెమీ సర్కారు కథలు. ముష్టివాళ్ల కథలు, నిరుద్యోగి కథలు: ఆకలి కథలు, చావుల కథలు, అంటరాని కథలు, ఎలక్షన్ కథలు, వరకట్నం కథలు, ట్రిక్కుల కథలు, టెక్కుల కథలు, కన్‌ఫ్యూజన్ కథలు, కాపీ కథలు, దొంగ కథలు, ఉపన్యాస ధోరణి కథలు...యిలా ఎన్నో కథలు.

మంచికథకు వస్తువు" "ఫలానా" మాత్రమే అయివుండాలని నా వుద్దేశ్యం కాదు. పై విషయాల్లో దేనిపైనైనా వుండొచ్చు. అయితే, వున్నంతలో మంచి కథలుగా పేర్కొన దగినవి (నా దృష్టిలో) 1) వోబిగాడు (ఆంధ్ర జ్యోతి) 2) ఇంట గెలుపు (ఆంధ్ర పత్రిక), 3) నిర్మాల్యం (ఆంధ్రజ్యోతి), 4) జవరాలి చిత్తం (యువ).

ఆలోచన రేకెత్తించే కథలు మూడు: (1) ఎవరికి ఎవరు పగోళ్లు (స్వాతి), (2) "తప్పు" (ఆంధ్ర ప్రభ), 3) ప్రసాదం (విజయ). ఇవిగాక సరదాగా చదువుకోడానికి, ఆసక్తిగా వుండే కథలు వో అరడజను: (1) నిప్పు (సౌఖ్య), (2) రాంబాబు గెల్చాడు (యువ) (3) సజీవ శిల్పం (ఆంధ్రప్రభ), (4) సీత బ్రతుకింతే (స్వాతి), (5) ఇద్దరమ్మాయిల కథ (ఆంధ్రజ్యోతి) (6) కిమ్మని కథ (ఆంధ్రజ్యోతి).

శ్రీ కుప్పిరెడ్డి పద్మనాభ రెడ్డి గారి కథ "వోబిగాడు" (ఆంధ్రజ్యోతి : 21 9, 79.) ఒక మంచి కథ. వోబిగాడు రెడ్డి గారింట్లో పని పిల్లాడు. రెడ్డి గారి కొడుకు రాంబాబు వయసులో రెండు మూడేండ్ల తేడాతో రాంబాబు కన్నా వోబిగాడు పెద్ద. వోబిగాడు దినమంతా యింటిపనీ, బయటి పనీ చేస్తూనే వీలు చిక్కినప్పుడల్లా గోలీకాయలు - యిత్యాదులు ఆడుతూ - పాడుతూ సరదాగా కాలం

## ఎక్కువ కథలు రాసిన రచయితలు

1. వి. వి. స మూర్తి
2. బె. వెం. సుబ్బారావు
3. యమ్వీయల్

పత్రికలో అచ్చయ్యే కథలు – 8

కొత్త రచయితలు 40%

గడుపుకుంటున్న మనిషి. ధైర్యం; నీతి గల పిల్లాడు. శ్రమకు వెరవడు రాం బాబుకు కొంచెం కుడి యెడమగా గల వోబిగాడంటే రెడ్డిగారికి ప్రేమ. రెడ్డిగారు ఉద్యోగ రీత్యా నెలలో 20 రోజుల క్యాంపుల్లోనే వుంటారు. కొడుకు ఆలనా-పాలనా చూసేది భార్య అత్త-యిద్దరే. వాళ్ళ మనస్తత్వం పిల్లలను క్రమశిక్షణలో పెంచేదిగా వుండదు. అందువల్ల వాళ్ళ అతి గారాబం కొడుకును ఎందుకూ పనికిరాని వాడిగా తయారు చేస్తుందని రెడ్డిగారి భయం. చదువు మిషతో కొడుకుని వాళ్ళ పెంపకంలోంచి తప్పించి, చదివించి, శ్రమ తెలిసిన మనిషిగా (వోబిగాడిలా) చేయాలని ఆయన ఉబలాటం.

ఒకసారి రెడ్డిగారు క్యాంప్ నుంచి వచ్చేసరికి కొడుక్కి సీరియస్‌గా వుందనీ, హాస్పిటల్లో ఉన్నాడనీ తెలుస్తుంది. వోబిగాడే రాంబాబుని కొట్టి, ఆస్థితికి తెచ్చాడని ఇంట్లో అందరూ చెప్తారు. ఆయనకు నమ్మకం కలుగదు. హాస్పిటల్లో బెడ్ మీద బలమైన గాయాలతో, కళ్లు నిలబెట్టి మాట లేకుండా పడివున్న కొడుకుని

చూసికూడా, వోబిగాడ్ని దోషిగా వూహించలేక పోతాడాయన. చివరకు తెలుస్తుంది- రాంబాబు దగ్గరున్న ఐదు రూపాయలు వోబిగాడు కాజేశాడనీ, అవి తిరిగి యిచ్చెయ్యమని తన భార్యా - అత్తా అడగడంతో ఘర్షణ మొదలై, వోబిగాడ్ని "దొంగ" అని హింసిస్తారు. కానీ, వాడు దొంగతనాన్ని అంగీకరించక తిరగబడతాడు. ఆ తిరగబడడంలో నాలుగు దెబ్బలు గట్టిగానే తగుల్తాయి రాంబాబుకు.

అసలు దొంగ రాంబాబు. క్యాంపుకు వెళ్ళే ముందు వోబిగాడికి తానే యిచ్చి వెళ్లాడు-ఆ ఐదు రూపాయలు. వోబిగాడి దగ్గర్నుంచి రాంబాబే డబ్బులాక్కుంటాడు. దాన్ని సమర్థిస్తూ ఇంట్లో వాళ్ళూ-వూళ్ళో అందరూ నౌకర్నే తిడతారు-హింసిస్తారు. తన నిజాయితీని అనుమానించి, తనని "దొంగ" అనడం వోబిగాడు సహించడు. అందుకే యజమాని కొడుకని గూడా ఆలోచించక, తిరగబడి రాంబాబుని తంతాడు. అది వాడి ధైర్యానికి నిదర్శనం. అందుకే వాడంటే రెడ్డిగారికి అంత యిష్టం. దొంగెవరో తెలిసిపోయింది. తన కొడుకుని కొట్టినందుకు వోబిగాడిపై ఆయనకు కోపంరాదు-వాడిపై వూరి పెద్దలు బనాయించిన కేసును ఆయన ఉపసంహరించుకుంటాడు.

మరో మంచి కథ "ఇంటి గెలుపు"; రచన శ్రీ బెహరా వెంకట సుబ్బారావు (ఆంధ్ర పత్రిక: 7-9-79) అదొక వూరు. ఆ వూళ్లో ఓ కాఫీ హోటలు: కాఫీతో పాటు టిఫిన్లూ దొరుకుతాయక్కడ. యజమాని పేరు వెంకన్న శెట్టి. వూళ్లో వాళ్ళందరూ కాఫీకీ-టిఫిన్లకూ వస్తారక్కడికి. తమ తమ హోదానుబట్టి-శాస్త్రిలు రెడ్లు, కరణాలు, కాపులు, హోటల్లోపల దర్జాగా కూర్చొని కాఫీ-టీలు చప్పరిస్తే-అలగాజన మని పిలవబడే అంటరానివాళ్ళు హోటల్ బయట అరుగు మీద కూర్చొని ఆకుల్లో టిఫిన్లు తిని చూరుకు వేలాడే గ్లాసుల్లో కాఫీలు త్రాగుతుంటారు. అలా తింటున్నప్పుడు పెద్దవాళ్ళెవరైనా వొస్తే మర్యాద కోసం చాటుకు వెళ్తారు. ఇదీ, ఆ వూళ్ళో-ఆ పాకలో కొన్నేళ్ళుగాన డుస్తున్న ఆచారం.

అలాంటిది, ఒక రోజు తలారి రావులు ఏకాయెకిన హోటల్ హాల్లోకి వచ్చి అదివరకే అక్కడ టిఫిన్ కొరకు కూర్చునివున్న శాస్త్రిలుగారి కెదురుగా బల్లమీద కూర్చోవడంతో కథ మొదలౌతుంది. రావులు లోపలికి రావడంతోటే, అందరూ-తలలేని మొండెం మాట్లాడ్తే విన్నంతగా ఆశ్చర్య పోతారు. తింటూన్న టిఫెన్లు వదిలేసి లేచి నిలబడతారు నిరసనగా. శెట్టి ఆ దృశ్యాన్ని చూసి విభ్రాంతుడవుతాడు. అంటరానివాడు హోటల్లో చొరబడితే, యితర కులాల వాళ్ళు తన హోటలు ముఖం చూడరు. కనుక దయచేసి మామూలు చోటికి వెళ్ళి కూర్చోమంటాడు రావుల్ని. రావులు వినడు. మాటలు పెరుగుతాయి. చివరకు రావులు తండ్రి కోటేసు వచ్చి కొడుకును కొట్టి లాక్కెళ్తాడు. రావులు ఆవేశంలో "కలెక్టరుకు

రిపోర్టు రాయిత్తా" "జిల్లాకి వుత్తరం రాయిత్తా ... నన్ను మాలోడని బయటికీడుస్తారా! యీళ్ల అంతు తేలుత్తా!" అంటూ అరుస్తాడు.

విషయం పెరిగి పెటీషన్ల వరకు వెళ్తుంది. చివరకు గడుసు ప్రెసిడెంట్ గారు ఎలాగో చక్రం అడ్డువేసి – ఏదో ఉపాయం చెప్పారు శెట్టికి. మర్నాట్నించి శెట్టి హోటల్లోకి రావులు బృందానికి ప్రవేశం; పది మందిని వెంటబెట్టుకు వెళ్ళాడు రావులు. వాళ్ళకేం కావాలో శాస్త్రిగారు స్వయంగా కనుక్కుంటున్నారు. శెట్టిచేత బల్లంపై నీళ్ల గ్లాసులు పెట్టించారు. పనికుర్రాడి చేత యిడ్లీల ప్లేటు, సాంబారు బాల్చీ పట్టించుకొచ్చారు పనికుర్రాణ్ణి చూసి రౌద్రంగా లేచి నిలబడ్డారు రావులు బృందం – "ఆ గుశవడి చేత్తోటినం! ఆణ్ణి బయటికంపించండి! మాకులంలో వాళ్ళ జాతి తక్కువ! వాళ్ళ చేతి మంచి నీళ్ళయినా తాగం!" అని కేకలేసాడు రావులు.

వాళ్ళందరిదీ మాల కులమే. కాని వాళ్ళల్లో మళ్ళీ జాతి భేదాలు. ఈ విషయాన్ని కథలో అతి చక్కగా చెప్పాడు రచయిత. వాళ్ళ జాతుల పేర్లు కూడా పేర్కొంటే యింకా బాగుండేది: పాఠకులకు యింకా కొంత విషయ పరిజ్ఞానం లభించేది.

ఇంకొక మంచికథ "వైశాలి" (పొదిల సీతాకుమారి) గారి "నిర్మాల్యం" (ఆంధ్ర జ్యోతి; 21-9-79). ఇది మినీ కథ। అయినా మంచికథ.

కృష్ణ – జయలది ప్రేమ పెళ్ళి. పెళ్ళికి పూర్వం కృష్ణ కొన్న కనకాంబరం చీర, హనీమూన్‌లో గుర్తుగా తొడిగిన వుంగరం; ఆఖరిసారి పరీక్షలు వ్రాసి విడిపోతున్నపుడు బీచిలో కృష్ణ యిచ్చిన పూలదండను సైతం (వాడిపోయాక కూడా) పదిలంగా దాచుకున్న అతిభావుకురాలు జయ. ఇంత భావుకతగల్గిన స్త్రీ తనకు భార్య కావడం ఎంతో అదృష్టంగా భావిస్తాడు కృష్ణ. అయితే, క్యాంపుకు వెళ్ళి కుర్రాడిచెత్తుకొని తిరిగి వచ్చిన జయలో వూహించని మార్పు – గుర్తించి ఆశ్చర్యపోతాడు

అంతవరకు పదిలంగా దాచుకున్న కనకాంబరం చీరను స్టీలు సామానుల వాడికీ, బంగారు వుంగరాన్ని కొత్తనగ చేయడానికి, (వాడిపోయి పర్సులో వున్న) పూలను పెంట మీదికి సాగనంపుతుంది జయ. పెళ్ళయి, పిల్లలు పుట్టాక స్త్రీలో ఎలాంటి మార్పొస్తుందో, ఆమెలోని భావుకత, ప్రేయసీ తత్త్వం, ఎలా నశిస్తాయో చక్కగా చిత్రించింది రచయిత్రి.

సరిగ్గా యిలాంటిదే మరో కథ వీరాజీ గారి 'జవరాలి చిత్తం' (యువ.) రాజ్యలక్ష్మి–కృష్ణలది అన్యోన్య దాంపత్యం. కృష్ణను పసిపిల్లాడిలా లాలిస్తుంది

రాజ్యలక్ష్మి. హోటల్లో తినకూడదు - బట్టలూ ఆమె చెప్పినవే వేసుకోవాలి — సినిమాలూ అంతే; ఆమె చెప్పినట్లే అచరిస్తాడు కృష్ణ. అయితే, హాయిగా సాగుతూన్న వాళ్ళ కాపురంలోకి మూడో ప్రాణం (కొడుకు) ప్రవేశిస్తుంది. యిప్పుడు రాజ్యలక్ష్మి లోకమంతా బాబు తోడిదే. భర్త విషయం అసలు పట్టించుకోనే పట్టించుకోదు. ఏ హోటల్లో ఏం తిన్నా - ఎలాంటి బట్టలు వేసుకున్నా-ఎలావున్నా గమనించదు.

వీరాజీ - వైశాఖి గార్ల కథలు రెండూ కూడా, స్త్రీ మనస్తత్వం, పిల్లలు పుట్టక ముందు - పుట్టాక - ఎలా వుంటుందో చక్కగా విడమర్చి చెబుతున్నాయి.

ఈ నెలలో "మంచిగా వున్నా" యనిపించిన కథలు యివే. వీటి తరువాత కాస్త ఆలోచింప దగిన కథలు - "ఎవరికి ఎవరు పగోళ్ళు (అరిగే రామారావు; స్వాతి). ఎప్పుడో - అప్పు మీద అలిగి ఊరొదలి వెళ్ళిన ముత్తిగాడి కథయిది. అవూరి ఫ్యాక్టరీ కార్మికులు, బోనస్ విషయంలో యజమానితో తగదాపడి సమ్మెకు దిగి కాల్పులు, చావులు, దహనకాండా జరపడంతో (పోలీసుగా - బందోబస్తు డ్యూటీ గా) తిరిగి వస్తాడు ముత్తిగాడు. అంతా సద్దుమణిగింది ముత్తిగాడికి అప్పని చూడాలనిపించింది ఊళ్ళో - తమ పేటకి వెళ్ళాడు. అందరు అతడ్ని ఈసడిస్తారు- అసహ్యించు కుంటారు వూళ్ళో జరిగిన మారణ హోమానికి కారకులు 'తుపాకీ పోలీసులే' అని నిందిస్తారు. "మాలో వాడివి, C. R. P. లో చేరి, మమ్మల్నే కాల్చడాని కొచ్చావన్నమాట!" అంటారు అప్పుడు విషయం వివరిస్తాడు ముత్యం "అటు పోలీసులూ - ఇటు కార్మికులూ చచ్చారు కాని మధ్యన గల యజమాని, వాడి పెళ్ళాం పిల్లలూ మాత్రం క్షేమంగావుంటారు - వాళ్ళెవరికీ ఏ హానీ జరుగ లేదు" — అంటూ "ఎవరికి ఎవరు పగోళ్ళో" గుర్తించమంటాడు.

మరో కథ : వి.వి.న. మూర్తిగారి "తప్పు" (ఆంధ్ర పత్రిక: 5-9-79).

చిరుద్యోగంలోంచి నిరుద్యోగంలోకి "డిమోట్" చేయబడ్డ వ్యక్తి వెంకట్రావు. అప్పటికి, అతన్ని కంటికి రెప్పలా కాపాడే బొమ్మ, తండ్రి; ఆస్థిపోయి, వాటి స్థానాల్లో ఒక పెళ్ళాం నలుగురు పిల్లలు; గంపెడు దరిద్రం మిగిలాయి. సదరు వెంకట్రావొరోజు పార్కులో వుండగా, దగ్గర్లో ముద్దులు మూటగట్టే కుర్రాడొకడు కన్పించడ తో, ప్రేమగా పిలిచాడు - దగ్గరకు రమ్మని కుర్రాడొచ్చాడు. "నీ పేరేమిటోయ్-" అని అడిగితే "నీకెందుకు? చెప్పను" అన్నాడు. ఆ పిల్లాడితో పేరు చెప్పించాలనే పట్టుదలతో డబ్బిస్తానని ఆశ పెట్టాడు. అయినా చెప్పనన్నాడు కుర్రాడు. బెదిరించాడు. అయినా వాడు చెప్పలేదు. ఇంటికి వెళ్ళి అలసటగా పడుకుంటే, వెంకట్రావు కొడుకు - "రెండు రూపాయలు తెచ్చా"నని చూపిస్తాడు. ఎక్కడిదని ఆరాతీస్తాడు వెంకట్రావు. తేలిందేమంటే, ఆ పార్కులో

కుర్రాడిలాగే, తన కొడుకూ ఎవరికో నుద్దొచ్చాడు. పేరడిగితే చెప్పనన్నాడు. అతను బ్రతిమాలాడట! "డబ్బు లిస్తే చెప్తా" నన్నాడట వీడు. ఆయన డబ్బు లిచ్చాడు - వీడు పేరు చెప్పాడు. తండ్రి దారిద్ర్యం; తన ఆకలి, వాడితో డబ్బు లడిగించాయి!

"ఒక కుర్రాడు డబ్బులిచ్చినా చెప్పనన్నాడు - వాడు కలవారి బిడ్డ! డబ్బు లడిగి యిప్పించుకొని చెప్పాడింకో కుర్రాడు! - వాడు దరిద్రుడి బిడ్డ - "ఆకలి బిడ్డ".

ఈ కథ గురించి మనం ఆలోచించాలి. ఒకడు పేరు చెప్పడానికీ మరొకడు చెప్పక పోవటానికీ కారణం ఏమిటి? వాళ్ళ ఆర్థిక స్థాయా? పెంపకం విధానమా? ఏదనేది మనం ఆలోచించుకోవాలి. ఇంత మంచి కథ వ్రాసిన వి. వి. న. మూర్తి గారి మరో కథ "కొండమీది యిల్లు" (భారతి) మామూలుగా వుంది. సాగదీయడం ఎక్కువైనట్లుంది; సంక్షిప్తంగా చెప్తే బాగుండేదేమో!

విజయలో వచ్చిన ఆకెళ్ళ సత్యనారాయణ గారి "ప్రసాదం" ఒకసారి చదవాల్సిన కథ. ఇవిగాక, ఆసక్తిగా, సరదాగా చదువదగిన కథలు అరడజను వచ్చాయి. వాటిని పైన పేర్కొన్నాను. ఇకపోతే, "ఆంధ్ర భూమి" కథలపోటీలో బహుమతి పొందిన కథలను కూడా యీ పరిశీలనకు స్వీకరించడం జరిగింది. మొదటి బహుమతి పొందిన కథ - కామినేని కృష్ణకుమారి గారి "కడుపుతీపి". సుమతి అందమైంది. వయసు రావడంలో ఆలోచన వచ్చి, ఒళ్ళు కొవ్వెక్కి, సుందర మనబడే సుందరుడితో లేచిపోతుంది. కడుపు కనపడేసరికి సుందరం కనబడకుండా పోతాడు. అతడి ప్రతిరూపం కడుపులో పెరుగుతున్నకొద్దీ, ఆ పసికందుపై అదోరకం కసి, కోపం. పారిపోయిన సుందరం ఎలాగూరాడు. యవ్వనం; కోరికలూ - అనంతంగా వున్నాయి. తన సుఖానికి కొడుకు అడ్డం అని ఆమె భావన. ఆభావన, అమె కడుపు తీపినే మింగేసింది. కథ చివర్లో సృష్టి ధర్మంగా కడుపుతీపి తన్నుకొస్తుంది. స్త్రీ మనస్తత్వాన్ని చక్కగా చెప్పారు. కథలో నగానికి పైగా, మాతృత్వం, కడుపు తీపి - ఇత్యాదుల్లోంచి తప్పించినందుకు మెచ్చుకోవాలి. పరవాలేదు - మంచి కథే.

తర్వాత, రెండవ - మూడవ ప్రైజుల కథలు సామాన్యంగా వున్నాయి. ఇక పాయసం సుబ్రహ్మణ్యశర్మ గారి "రేపటి వ్యవస్థ" (ఆంధ్ర జ్యోతి: 7-7-79) కథ; కథలాకాక ఉపన్యాసంలా వుంది. శ్రీ కె. కె. మీనన్ గారి "వెన్నెల మెట్లు" (ప్రభవ) అస్పష్టంగా వుంది. స్పష్టతే వుండివుంటే మంచి కథగా మిగిలేది.

నవలలు రాస్తున్నంత విరివిగా రచయిత్రులు కథలు రాయడం లేదని ఈ పరిశీలనలో తేలిన మరో విషయం.

**శృతిఫలం :** సెప్టెంబర్‌లో 1979 కథల పరిశీలన పుణ్యమా అని; హఠాత్తుగా అయిదేళ్ళు వెనక్కి వెళ్ళి రావల్సి వచ్చింది. (అందుకు కారకులైన శ్రీ ఎర్రంశెట్టి శాయి గారికి కృతజ్ఞతలు). అప్పుడెప్పుడో శీలం శెట్టి రమాదేవి గారి కథ "రాణి"ని స్వాతిలో చదివినట్లు గుర్తు. ఆ కథే అవతారాంతరంలో "రావణాసురుడి బొమ్మ"గా యువలో దర్శనమిచ్చింది. శ్రీ శాయిగారు గత పది పదిహేనేళ్ళుగా కథారంగంలో సవ్యసాచి అయివుండీ, నిన్న మొన్న కలం పట్టిన ఆడ కూతురి స్క్రిప్టును XEROX చేయడం నాకు మాత్రం బాగనిపించలేదు. (అయితే, వీరు యింతకు ముందే యిలాంటి కథాచౌర్యానికి పాలుపడ్డ సంగతి పాఠకులకు నేను పనిగట్టుకు చెప్పాల్సిన పనిలేదు).

వసంతరావు దేశ పాండే

---

## సవరణ

"చలం – స్త్రీ" వ్యాసం మొదటి పేరాలోని "పారిశ్రామిక వ్యవస్థ పూర్తిగా ఏర్పడని ఆ కాలంలో ఇండియన్ ప్రొలిటేరియట్ స్త్రీయే అని సరిగ్గా అన్నారు మహా సంస్కర్త రాజారామ్ మోహన్‌రాయ్" అనే వాక్యాన్ని, "ఆనాడు పాశ్చాత్య దేశాల పారిశ్రామిక వ్యవస్థలో ప్రొలిటేరియట్ల బాగుకోసం యూనిటేరియన్లు పాటు పడుతూ ఉండగా పారిశ్రామికీకరణ చెందని ఆనాటి భారతీయ సామాజిక వ్యవస్థలో స్త్రీనే ప్రొలిటేరియట్‌గా ఎంచుకుని మహా సంస్కర్త రాజరామ్ మోహన్‌రాయ్ కృషి చేశారు" అని మార్చుకుని చదువుకోవాలి.

అసౌకర్యానికి చింతిస్తున్నాం. — సం॥

---

## నో అదర్ గో

పెళ్ళున చిట్లిన
కన్నీళ్ళపై
వాడి కాళ్ళు
అలవోకగా అలా నడుస్తున్నప్పుడు
నువ్వు నీకసం
ముళ్ళ పెంకైనా
కాకపోతే
నువ్వెంతే !

-నీలాదత్

## "విమోచన"

కనులు తెరిచే సమయాన
ప్రపంచంలో సగభాగం
అరుణమై ఉంటుంది
ఆవేశంతో కొడవళ్ళు యెత్తే సమయాన
చెవిలో ఒక విముక్తి గానం
విన్పిస్తుంది.
బుజం బుజం కలిపే దినాన
యెర్రకోటపై ఎర్రజెండా యెగురుతుంది.

—గోవిందు వెంకట్రావు

# సాంఘిక సంస్కరణకు తోడ్పడిన 'మాలపల్లి' నవల

## ఉన్నవ శత జయంత్యుత్సవాల్లో వక్తల ప్రశంస

కావలిలో ఈ నెల 15, 16 తేదీల్లో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ శత జయంత్యుత్సవాలు సొసైటి ఫర్ సోషల్ ఛేంజి వారి ఆధ్వర్యంలో జరిగాయి. ఉత్సవ కమిటీకి కన్వీనర్‌గా శ్రీ యన్. వి. రమణయ్య వ్యవహరించారు.

శ్రీ ఉన్నం చెంద్రయ్య స్వాగతం చెపుతూ శ్రీ ఉన్నవ జీవిత ఘట్టాలను చదివి వినిపించారు.

విశాలాంధ్ర ప్రచురణాలయం సంపాదకులు శ్రీ ఏటుకూరి బలరామమూర్తి ప్రసంగిస్తూ పేదరికం అంతంకావాలని, అందరికీ కూడు, బట్ట గూడు సమకూరాలని అనాటి ఆకాంక్ష మాలపల్లినవల్లో స్పష్టంగా కన్పిస్తున్నదని, పేదరికం, పారతంత్ర్య సమస్యలు ఉన్నవ ప్రధానంగా భావించారని తెలియ చేశారు.

అచల వేదాంత తత్వం ద్వారా కుల మత వ్యవస్థను శ్రీ ఉన్నవ ఖండించారని, అయినా క్రైస్తవ, హిందూ మతాల తారతమ్యాల పరిశీలనచేసి హిందూమత ప్రశస్తిని నిరూపించడానికి వారు ప్రయత్నించడం అభ్యంతరకర విషయమని అన్నారు. సంఘం పట్ల వ్యక్తి క్రియాశీలతను శ్రీ ఉన్నవ బలపరచారని శ్రీ బలరామమూర్తి అన్నారు.

రాయవేలూరు జైల్లోసహ ఖైదీగా వున్న శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య ప్రసంగిస్తూ శ్రీ ఉన్నవతో తనకు గల పరిచయాలను సభకు తెలియ చేశారు.

ఉన్నవ రాజకీయ తత్వంపై శ్రీ కె. వి. రమణారెడ్డి ప్రసంగిస్తూ కాంగ్రెస్ ఆమోదం లేకుండా భౌతిక పరిస్థితుల ప్రేరణతో సాగిన పల్నాటి రైతు ఉద్యమాన్ని బలపరచి, ప్రజా ఉద్యమాలకు శ్రీ ఉన్నవ సంకేత ప్రాయులైనారని, ఒకవైపు జాతీయ రాజకీయ రంగంలో అభినివేశం, మరోవైపు మతదృష్టి వీరి వ్యక్తిత్వంలో పడుగు పేకల్లా అల్లుకు పోయాయని, వారి వ్యక్తిత్వంలో సనాతన ఛాందన స్పర్శ కలదని అన్నారు.

వ్యవసాయ కార్మికుల్లో ట్రేడ్ యూనియనిజం ప్రవేశ పెట్టారని, సర్వ మానవ సమానత్వాన్ని, వర్గ సామరస్యాన్ని శ్రీ ఉన్నవ అభిలషించారని అన్నారు.

కన్యాశుల్కానికి దీటైనది మాలపల్లి నవల అని చెప్పారు.

శ్రీ ఉన్నవ వేసిన ప్రతి అడుగుకు శ్రీమతి లక్ష్మీబాయమ్మ అనగా వున్నదని శ్రీ ఉన్నవ దాంపత్య జీవితాన్ని వివరిస్తూ శ్రీ గోపాలకృష్ణ శర్మ అన్నారు.

మాలపల్లిపై ప్రభుత్వ నిషేధాలను శ్రీ బంగోరే వివరిస్తూ బోల్షివిజాన్ని నవలలో చూసి భయపడి బ్రిటిష్ పాలకులు నిషేధపు ఉత్తర్వులు జారీ చేశారని, కమ్యూనిజాన్ని భావన చేయడం ఆ రోజులో పెద్ద ముందడుగని అన్నారు.

సాంఘిక సంస్కరణల్లో 'శారదా నికేతన్'అనే అంశంపై శ్రీ కె. రామమో

హన్‌రాయ్ ప్రసంగిస్తూ గుంటూరులో శారదా నికేతన్, వీరేశలింగం గారి హితకారిణీ సమాజంకన్నా ఒక అడుగు ముందుకు వేసి హరిజన బాలికలకు స్థానం కల్పించిందని అన్నారు గాయకులు శ్రీ మానెపల్లి నరసింహమూర్తి ఉన్నవ గీతాలను శ్రావ్యంగా ఆలపించారు. త్రివేణి సంపాదకులు శ్రీ భావరాజు నరసింహారావు "ఉన్నవ రచనలు కొన్ని" అనే పేరుతో ముద్రించిన సంకలనాన్ని ఆవిష్కరించారు.

శత జయంతి సందర్భంగా ఉన్నవ స్మృతి చిహ్నంగా కేంద్ర ప్రభుత్వం తపాలా బిళ్ళను విడుదల చేయాలని, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మాలపల్లి పూర్తి నవలను ముద్రించాలని, కేంద్ర సాహిత్య అకాడమీ ఈ నవలను హిందీ ఇంగ్లీషుభాషల్లోకి అనువదింప చేయాలని కోరుతూ సభ తీర్మానాలను ఆమోదించింది. 16వ తేదీ రాత్రి హైదరాబాద్ నవరస నట బృందం వారు శ్రీ ఎ. ఆర్ కృష్ణ దర్శకత్వంలో "మాలపల్లి" నాటకాన్ని ప్రదర్శించారు.

## కాన్‌స్టాంటిన్ సిమనోవ్ కన్నుమూత

ద్వితీయప్రపంచసంగ్రామ కాలంలో తన రచనలతో, కవితలతో యుద్ధ రంగాలలోని సైనిక శ్రేణులనూ, సామాన్య ప్రజానీకాన్ని ఉర్రూతలూపిన సుప్రసిద్ధ సోవియట్ రచయిత కాన్‌స్టాంటిన్ సిమనోవ్ కొద్దిరోజుల క్రితం మరణించారు.

ఆయన సోవియట్ప్రభుత్వ హయాములో పుట్టి పెరిగిన వ్యక్తి. 1941 లో ఆయన యుద్ధ విలేకరిగా బాధ్యత స్వీకరించే నాటికి వయస్సు 26 సంవత్సరాలు. ఆయన ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో ఆది నుండీ, అంతం వరకూ, యుద్ధ రంగంలో వుండి, భీషణ సంగ్రామ వార్తలను ఎప్పటికప్పుడు అందిస్తూ వచ్చారు. "నా కోసం ఎదురు చూడు" అన్న ఆయన గీతిక యుద్ధరంగంలోనూ, సోవియట్ దేశం నలుమూలలా ఆనాడు మార్మోగింది.

ఒక నౌకా దళ అధికారి కుటుంబంలో కాన్‌స్టాంటిన్ సిమనోవ్ జన్మించారు. ఆయన తండ్రి ప్రథమ ప్రపంచ సంగ్రామంలో మరణించారు.

సమస్త సాహిత్య ప్రక్రియలను చేపట్టారు. ఆయన నాటక రచయితగా, నవలా రచయితగా, సాహిత్య విమర్శకుడుగా, సంపాదకుడిగా సోవియట్ దేశంలో సుప్రసిద్ధులు ఆయన గ్రంథాలు "కామ్రేడ్ ఇన్ఆర్మ్స్," "ది లివింగ్ అండ్ ది డెడ్" దేశ దేశాలలో బహుళ ప్రాచుర్యం పొందాయి.

## 'నవసృష్టి' అవిష్కరణ

ఈ మధ్య హైదరాబాదలోని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో డా॥ అంతటి నరసింహంగారి కవిత 'నవసృష్టి' అన్న గ్రంథం ఆవిష్కరణ సభ జరిగింది అ. ర. సం. అధ్యక్ష వర్గ సభ్యులు డా. ॥ సి. నారాయణరెడ్డి అధ్యక్షత వహించారు. డా॥ బెజవాడ గోపాల రెడ్డి, శ్రీమతి వాసా ప్రభావతీ దేవి అరసం అధ్యక్షవర్గ సభ్యులు కుందుర్తి ప్రభృతులు ప్రసంగించారు. నిలయం కార్యదర్శిశ్రీ యమ్. యల్. నరసింహారావ్ గారు తొలుత స్వాగతం పల్కారు.

## క వి తా గో ష్ఠి

భాగ్యనగరంలోని సాహితీ సాంస్కృతిక సంస్థ 'వేదిక' ఆధ్వర్యంలో సెప్టెంబరు నెలలో నగర కేంద్ర గ్రంథాలయంలో కవితాగోష్ఠి జరిగింది. ఆం. ప్ర. అ. ర. సం. కార్యవర్గ సభ్యులు శ్రీ రాంభట్ల అధ్యక్షత వహించారు. డా॥ అరిపిరాల విశ్వం ప్రధాన వక్తగా పాల్గొన్నారు. శ్రీ ఎన్. గోపి; శ్రీ ఏటుకూరి ప్రసాద్, శ్రీ సుధామ, శ్రీ లక్ష్మణరావు, శ్రీవై. రామకృష్ణ, శ్రీ గౌరీ శంకర్, తదితరులు తమ కవితలు చదివి వినిపించారు.

## 'సాహిత్యంలో తగాదాలు' – గోష్ఠి

హైదరాబాద్‌లోని సారస్వత పరిషత్ హాలులో ఆ మధ్య నాటి నుండి నేటిదాక తెలుగు సాహిత్యంలో సంభవించిన వాదోపవాదాలను గురించి అరసం అధ్యక్షవర్గ సభ్యులు డా॥ బూదరాజు రాధాకృష్ణ ప్రసంగించారు. ఈ గోష్ఠిని వేదిక ఏర్పాటు చేసింది.

## శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రి రచనలపై సాహిత్యోపన్యాసాలు

డా॥ చామర్తి కనకయ్య గారు శ్రీ పాదసుబ్రహ్మణ్యశాస్త్రి గారి రచనలపై పరిశోధన చేశారు. వీరి మధ్య ఏలూరులోని సాహిత్య మండలి; జిల్లా గ్రంథాలయ సంస్థలు సంయుక్తంగా ఏర్పాటుచేసిన సభలోనూ, అలాగే తాడేపల్లి గూడెంలోని తెలుగు సాహితీ సమాఖ్య ఆధ్వర్యంలోని జరిగిన సభలోనూ ప్రసంగించారు. ఏలూరు సమావేశానికి ఆం. ప్ర. సాహిత్య అకాడమీ సభ్యులు శ్రీ కొండముది శ్రీ రామచంద్ర మూర్తి, తాడేపల్లిగూడెం సభకు శ్రీ గూడవల్లి నరసింహారావు గారలు అధ్యక్షతవహించారు. శ్రీ కనకయ్య గారిని రెండు సమావేశాల్లోనూ సన్మానించారు.

x x

# సాహిత్య సంస్థలకు విజ్ఞప్తి

1980 మార్చి 2వ తేదీన కాకినాడలో జరుగబోతున్న శ్రీ శ్రీ సప్తతిపూర్తి మహోత్సవం మహోజ్వలంగా జరగడానికి ఆంధ్ర దేశంలో అన్ని ప్రాంతాల్లోనూ చైతన్యస్ఫూర్తితో పనిచేస్తున్న సాహిత్య సంస్థల సహకారాన్ని మేము

మనసారా కోరుకుంటున్నాం.

ఈ మహోత్సవాన్ని తలపెట్టి పత్రికాప్రకటన ఇవ్వగానే మమ్మల్ని అభినందిస్తూ ప్రోత్సహిస్తూ వ్యక్తుల సాహితీ సంస్థల నుంచీ ఎన్నెన్నో వచ్చాయి : వస్తున్నాయి. ఉత్తరాలు అందరికీ మా కృతజ్ఞతలు.

70 ఏళ్ళు నిండుతున్న శ్రీ శ్రీ సకుటుంబంగా కాకినాడ రావడానికి ఆమోదించారు. కాకినాడలో ఒక ఆహ్వాన సంఘం ఏర్పడుతూఉంది. ఈ మహోత్సవంలో భాగంగా ఆ నాటి ఉదయం శ్రీ శ్రీ కవిత్వం మీద శ్రీ మిరియాల రామకృష్ణగారి థీసిస్సు ఆవిష్కరణం, మధ్యాహ్నం వివిధ సాహితీ సంస్థల ప్రతినిధుల సదస్సు, సాయంకాలం ప్రముఖ సాహితీ వేత్తల ఉపన్యాసాలు, ప్రత్యేక సంచిక విడుదల, శ్రీ శ్రీ సందేశం ఉంటాయి. సాహిత్య సంస్థలు తమ ప్రతినిధులను ఆ నాటికి కాకినాడ పంపవచ్చు. ప్రతినిధులకు మా సంఘం ఉచిత వసతి సౌకర్యాన్ని ఏర్పాటు చేస్తుంది ఈ సందర్భంలో ఈ మహోత్సవానికి నిధులు సమకూర్చి సహకరించవలసిందిగా సాహిత్య సంస్థలను అభ్యర్థిస్తున్నాం. ప్రతి సాహిత్య సంస్థ దీనిని తన ఉత్సవంగానే భావించి కనీసం నూరు రూపాయలకు తక్కువ కాకుండా తన విరాళాన్ని కార్యదర్శి చిరునామాకు అక్టోబరు నెలాఖరులోగా అందేటట్లు పంపవలసిందిగా కోరుతున్నాం. ఇతర వివరాలేమైనా కావలసినవారు సొంత చిరునామాతో స్టాంపులుగల కవరు పంపాలి. కింది నమూనాలో వివరాలు పంపవలసిందిగా కోరుతున్నాం.

1. సాహిత్య సంస్థ పేరు, చిరునామా
2. హాజరు కానున్న ప్రతినిధి పేరు (ఫోటో కూడా జతపరచాలి)
3. చిరునామా
4. వయస్సు
5. ఇతర వివరాలు (బయోడేటా)
6. విరాళం. రూ.
7. ప్రతినిధి సంతకం
8. సాహిత్య సంస్థ అధ్యక్షుల సంతకం

ఆహ్వాన సంఘం అధ్యక్షులు
డా॥ ఆటూరి విజయలక్ష్మి
కాకినాడ-1

కార్యదర్శి :
డా॥ పి. చిరంజీవినీ కుమారి
ప్రతాప్‌నగర్, కాకినాడ-4

## ప్రేంచంద్ శత జయంతులు

కా కి నా డ

ప్రముఖ సాహితీవేత్త ప్రేమ్‌చంద్ పేదరికంలో జీవించి తన రచనలద్వారా పేదల కోసం పాటుబడ్డ అభ్యుదయవాది ఆదర్శజీవి అని యిటీవల యిక్కడ జరిగిన సభలో పలువురు నివాళులర్పించారు

ప్రేంచంద్ శతజయంతి సందర్భంగా స్థానిక అరసం శాఖ అధ్వర్యాన జిల్లా కేంద్ర గ్రంధాలయంలో జరిగిన ఈ సభకు స్థానిక పి. ఆర్. ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కె. పురుషోత్తమరావు అధ్యక్షత వహించారు.

ప్రేంచంద్ అన్ని వర్గాలలో ఉన్న సమకాలీన సమస్యలను స్పృశించి దర్పణం పట్టి వాటి వికృత స్వరూపాన్ని సమాజానికి తెలిసేటట్లు చేశారని పురుషోత్తమరావు పేర్కొన్నారు.

అనంతరం, పి. ఆర్. కాలేజీ హిందీ విభాగ అధ్యక్షులు డాక్టర్ అన్నపరెడ్డి శ్రీరామరెడ్డి మాట్లాడుతూ 1880 లో లంగి గ్రామంలో జన్మించిన ప్రేంచంద్ జననాడి ఎలానడుస్తుం దో తెలుసుకొనిదానికి చికిత్సతెలిసిన వైద్యుడని అన్నారు.

తదుపరి, పి. ఆర్. కాలేజీ హిందీ అధ్యాపకులు శ్రీ నూకల సూర్యనారాయణమూర్తి ప్రసంగిస్తూ ఉత్తర భారత చరిత్ర అంతా ప్రేంచంద్ సాహిత్యం చదివితే తెలుస్తుందని, నిమ్న వర్గానికి చెందిన ప్రేంచంద్ ఎప్పుడూ దారిద్ర్యంతో జీవించిన వాడని,వీరి రచనలు డి. కెన్స్, గోర్కీల రచనలవలె నిమ్న వర్గాల జీవితాలను చిత్రించాయని అన్నారు.

అంతరం ప్రఖ్యాత విమర్శకులు, కవి శ్రీ అవంత్స సోమసుందర్ ప్రసంగిస్తూ ప్రేంచంద్ అభ్యుదయ వాదనీ, ఆదర్శ వాదిగా పుట్టి, సమాజవాదిగా. ఉదారవాదిగా, సామ్యవాదిగా ఎలా పరిణతి చెందారో వివరించారు.

అధ్యక్షుని తుది పలుకుల అనంతరం శ్రీమతి చిరంజీవినీ కుమారి వందన సమర్పణచేస్తూ కబీర్‌దాసు,వేమన జయంతి సభలుకూడ జరపాలనే అరసం అభిప్రాయాన్ని తెలియజేశారు.

## కావలి

ప్రేంచంద్‌శతజయంతి సందర్భంగా కావలి మున్సిపల్ ఆఫీసు ఆవరణలో "సొసైటీ ఫర్ సోషల్ ఛేంజ్" ఆధ్వర్యాన సభ జరిగింది.

సభలో శ్రీ ఆర్. సుందరరావు ప్రేంచంద్ సామాజిక నిబద్ధతను గురించి వివరించారు. ఆయన ప్రముఖ అభ్యుదయ రచయిత, సంఘ సంస్కర్త అని అభివర్ణించారు.

ఇంకా శ్రీ కె. వి. రమణారెడ్డి, శ్రీ ఉన్నం చెంచయ్యలు మాట్లాడారు.

---



అగస్టినొ నేటో

Edited Printed and Published by T Venkataramaiah 3 6-737/3 Himayatnagar Hyd 2[illegible]
Printed at Nagarjuna Printing Works